# గృహలక్ష్మి



# GRIHALAKSHMI

15th SEPTEMBER 1959

Vol. 28

No. 9

40 nP.






జయజయ గృహలక్ష్మీశ్రీ సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతీమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్ :
సి. సి. పున్నయ్య



# జాతీయ విధానముల ప్రాముఖ్యత

ప్రతియొక్క దేశపు అభ్యుదయ అభివృద్ధులు వివిధ రంగాలలో తాము రూపొందించుకునే విధానములమీద నాధారపడియుంటవి. ముఖ్యంగా జాతీయవిధానములు రూపొందించే సందర్భమున ఆయా దేశాల ప్రజలు తమ గురుతర బాధ్యతలను గుర్తించి జాతీయ సమస్యల పరిష్కారానికి నడుము బిగించి ప్రభుత్వముతో సహకరించి సహాయ పడునట్లు చేయగల వాతావరణము సృష్టించాలి. అంటే ప్రభుత్వమే ప్రజలు, ప్రజలే ప్రభుత్వము; ప్రజల శ్రేయోసౌభాగ్యముల నుద్దేశించి వారి సహాయ సహకారములతో వివిధసమస్యలు పరిష్కారానికి ప్రభుత్వ విధానములు రూపొందుతున్నవనే విశ్వాసము ప్రజలలో కలుగాలి. ఆనాడే ప్రజాస్వామిక వ్యవస్థకు ఘనవిజయము.

అధికారములో ఏ పార్టీయున్నా ప్రజలకు, ప్రభుత్వమునకు మధ్య పరస్పర సద్భావ సహకారములు లోపించిననాడు కలవరము, కల్లోలము ఉత్పన్నమగుట తథ్యమని యీమధ్య కేరళలోని కల్లోలవాతావరణము నిరూపించినది. అంతేకాదు ఏ

రాష్ట్రంలోనైనా ప్రభుత్వ విధానాలు జాతీయ ఆదరాభిమానములకు పాత్రముకాక పోయినచో యిలాటి వాతావరణము సృష్టికావచ్చును.

విద్య, వ్యవసాయ, ఆహార, వర్తకవ్యాపారము యిత్యాదిరంగాలలో ప్రజలకు ప్రభుత్వమునకు పరస్పరసద్భావ, సహకారములతోకూడిన జాతీయవిధానములు రూపొందవలసియున్నవి. అభివృద్ధి, అభ్యుదయాలనుద్దేశించి కోట్లకు కోట్లు రూపాయలు వెచ్చిస్తూకూడ యీనాడు జాతీయవిధానములను రూపొందించడములో ప్రజలకు ఆత్మవిశ్వాసమునుగాని, తృప్తినికాని ప్రభుత్వము కలిగించలేకపోతున్నదనడానికి యీనాటి దేశ వ్యాప్త పరిస్థితులు, వాతావరణము చాలును.

ఏక్షణానికాక్షణం ప్రజలజీవితం కటకటలాడి పోతున్నది. ప్రజల జీవితావసరాలధరలు తమ ఆదాయముతో సంబంధములేకుండా పెరిగిపోతున్నవి. అంటే ఆహార ధాన్యాలు, చక్కెర మొదలైనవాని లోటువల్ల ననడంకంటె జాతీయజీవితంలో ప్రజలు, ప్రభుత్వముకూడ వాస్తవికతకనుగుణ్యంగా విధానములను రూపొందించడముకాని, సానుభూతితో బరువు బాధ్యతలను స్వీకరించడముకాని లేదని ఋజువగుచున్నది. ఈ పరిస్థితులలో ప్రజలు ఆర్థికంగా గిజగిజలాడుతూ అలమటించి స్వీయ సౌభాగ్యమునకే గాని, జాతీయ సౌభాగ్యమునకేగాని చేయగలిగినదేమి యుంటుందో ప్రజానాయకత్వము గుర్తించి వ్యవహరించడము తక్షణకర్తవ్యము.

ప్రస్తుతము జాతీయ అంతర్జాతీయ పరిస్థితుల దృష్ట్యా మన జాతీయ, అంతర్జాతీయ విధానాలు ఎంత ఉత్కృష్టమైనవైనా మన మంచితనాన్ని అపార్థము చేసికుంటున్న దేశాలుకూడ నున్నవి. మనకు యింట బయటకూడ శాంతి యవసరము. పొరుగు రాజ్యాలతో సత్సంబంధాలు అవసరము. అయితే యింట బయటకూడ అభివృద్ధి నిరోధకశక్తులకు బలీయయి వ్యక్తిత్వమును కోల్పోగల ప్రమాదమునుండి రక్షించగల జాతీయనాయకత్వము, జాతీయ, అంతర్జాతీయ విధానములు ముఖ్యావసరములు.

ఈ సందర్భమున ప్రభుత్వము, ప్రజలు జాతీయతకనుగుణ్యంగా తమ బాధ్యతలను గుర్తించి వ్యవహరించుట తక్షణకర్తవ్యము.



# మన నాటకం

## [పంచ వర్ష ప్రణాళికలు]

శ్రీ పోలాకి శ్రీనివాసరావు

### పాత్రలు

పురుషులు:- 1. మాధవయ్య - ఉపాధ్యాయుడు
2. బంగారయ్య - సంపన్న రైతు
3. రాఘవయ్య - రైతుకూలి
4. భాస్కరయ్య - ప్రభుత్వ గ్రామ సేవకుడు

పిల్లలు :— 5. గోపాలం - బంగారయ్య కుమారుడు
6. గోవిందం - రాఘవయ్య కుమారుడు

స్త్రీలు :— 7. కమలం - మాధవయ్య భార్య
8. లక్ష్మి - నిరుపేద వనిత

### మొదటి రంగం

[మాధవయ్య ప్రాథమికోపాధ్యాయుడు, బేసిక్ విద్య పునః శిక్షణ (Re-training) పొంది వచ్చెను.
ప్రదేశము :—మాధవయ్య గృహము
ప్రవేశము:—మాధవయ్య ప్రాతః కాల ప్రార్థన జేయుచుండును,]

పాట

మాధవయ్య :—

రఘుపతి రాఘవ రాజారామ్ !
పతిత పావన సీతారామ్ !
ఈశ్వర అల్లా తేరేనామ్ !
సబకో సమ్మతి దే భగవాన్ !
రామ రామ జయ రాజారామ్ !
రామ రామ జయ సీతారామ్ !
ఈశ్వర అల్లా ఏసు ప్రభూ !

కమలం :-[టీ – ఉప్మా పట్టుకొని ప్రవేశించును.]

మార్పు గాంచె మన నాటకము

మా:-కమలం ! ఏమట్లబ్బుర పడుచున్నావు !

క:-నా ప్రాణేశ్వరులు హిందువులై యుండి అల్లా ఏసు మొదలయిన మహమ్మదీయ దేవుళ్లను క్రైస్తవ దేవుళ్లను [illegible]చున్నారు కదా యని,

మా:-అట్టి సందేహము పొందవద్దు. దేవుడొక్కడే కదా? కనుక మనము జాతి మత భేదములను పాటింపరాదు.

క:—మతములే గాకుండ జాతి భేదము సైతము పాటింపరాదా ?

మా:-ఔను, నిన్న నిన్నటి దనుక ప్రభుత్వ బేసిక్ విద్యా శిక్షణాలయములో పొందిన పునః శిక్షణ ఫలిత మేమనుకొంటివి ?

క:-మాల మాదిగలతో భుజించినారా యేమి ?

మా:-బేలా ! బేల ! అట్లనెదవేమి ? హరిజనులు మాత్రము మానవులు కారా ?—హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు హరిజనులు సర్వ మతములవారము, సర్వజాతులవారము ఒకే విద్యాలయములో కలసి మెలసి ఒక చోటనే వండుకొని, తిండి తిని, పండుకొని ఒకరిసేవ నొకరు సలిపి ఐకమత్యముగా కాలము బుచ్చి నాము. మేము జాతి మత భేదములను పాటించి యుండలేదు. అట్టి భేదము లేదనుటకే సర్వ జగన్నాటక సూత్రధారుడగు ఆభగవంతుని అల్లా గాను, ఏసుగాను, రామునిగాను ఆరాధించు చున్నాను.

క:-మీ బేసిక్ మతమేమో నాకు బోధగాకున్నది. పండువంటి సద్వంశమును పాడుచేయ తలంచి నారు. [illegible]

నిదురసైతము పట్టనీయకున్నారు. మీ బేసిక్ శిక్షణ చాలా బాగాసేయున్నది.

మా:- పెద్దవారికి ఆరుగంటలకాలము నిదుర చాలును. కనుక, రాత్రి పది గంటలకు పరుండి తెల్లవారు జామున నాల్గు గంటలకు లేవవలెను. మిగిలిన పదునెనిమిది గంటల కాలము వ్యర్థముచ్చక కార్యములు చేయవలెను.

క:- బాగు, బాగు. మీవలెనే వేకువజామున లేచుటకు అలవాటు చేసెదను. ఇవి ఆరగించండి!

(తాను తెచ్చిన ఉప్మా - టీ- మాధవయ్యగారి చెంత నుంచును.)

మా:- ఏమిటివి? ఉప్మా - టీ - ! ఆహా! ఎన్నో నాళ్ళు యీ టీ కొరకు ఎన్నో యిక్కట్టులు పొందియుంటిని గదా!

సీ॥ ఉదయము నందు టీ। విధిగాను
త్రాగగా
కూర్చొను వేళకు। గొడుకు వచ్చు,
కూతురు గ్లాసును। చేతను బట్టుక
చెంత నిలిచి యుండు। వింతగాను,
"చురుకైన టీ త్రాగ। మరగిన వారలు
వదల జాల" రనుచు। భార్య
నిలచు,

క:- బాగు, బాగు. నాబయమూ బయట వేస్తున్నారూ?

మాధవ:—

"మూల నున్న ముసలి। ముద్దల
మరువకు"
మని తలిదండ్రులు। యరచు
చుంద్రు,

తే॥గీ॥ పనిని గల్పించుకొనివచ్చు। ప్రాణ
హితుడు,
అందరకు - టీ - ని బంచి నా,
కసలె లేక
అంగడికి బోయి పలుసారు। లార
గించి,
జీత మంతయు వెచ్చము। జేసి
నాడ!

ఇంక నీ - టీ - దీసివేయుము. దీనినే గాక పొగ చుట్ట, సిగరెట్టు, బీడీ, కిల్లీ, పొడుము మున్నగు వ్యసనము లన్నిటికి స్వస్తి జెప్పి యున్నాను.

క:- అట్లయిన మన పిల్లలూ, మనమూ చక్కగా జీవించెడి కాలము సంభవించినది. ధన్యులము, ధన్యులము. మీ బేసిక్ విద్య చాలా ఉపకారియే యైనది.

మా:- మన నాటక మంతా మారియుండెనని నీవేగదా పలికితివి. నేను పూర్తిగా మారియుంటిని. నీవును చాలా మార్పు బొందవలసియున్నది.

క:- ఇంకేమి మార్పు బొందవలెను. ఇంతకు పూర్వమే మంగళ సూత్రముదక్క మిగిలిన నగలన్నియు దీసి సన్యాసి దానిని గా జేసినారు.

మా:- హృదయ పరివర్తనము కావలెను. అందుకు దోడు వర్తన చక్కబడి జీవితము బాగుపడవలెను.

క:- ఏమిటో మీ నవీన సిద్ధాంతాలు! సరే, కాని మన అమ్మాయికి ఓనమాలు గాని, గుణితముగాని, బరులుగా (వరుసలుగా) వ్రాయ దము రాదేమి?

మా:- కమలం! అ ఆలు, గుణితము పట్టీలుగా వ్రాయించి దిద్దింపరాదు. అది విజ్ఞానము చాలని బండ విద్య.

క:- ఏమిటో! క్రొత్తవిద్య, క్రొత్తవిద్య అంటున్నారు. ఓనమాలు, గుణితము నేర్పకుండిన పిల్లలకెట్లు విద్యవచ్చును.

మా:- విజ్ఞానముతో విద్యను నేర్పవలెను. మరియు, అక్షరాస్యత వేరు, విద్య వేరు. అక్షరాస్యత సులభముగా శీఘ్రకాలములో నభ్యసింపవచ్చును. విద్య నేర్చుకొనుటకు కాల పరిమితిని నిర్ణయింపలేము. అక్షరాస్యతతో విద్యను సమన్వయ పరిచి ఆచరణలో పెట్టునప్పుడే మిక్కిలి లాభమును పొందవచ్చును.

క:- ఈ విద్యావిధాన మెట్టిదో వివరించెదరా?

మా:- ఈ నవీన విద్యా విధాన మెట్టి దనగా?

ఆ॥ వె॥ జీవితమ్ము తోడ। జీవితమ్ము
కొరకు
జీవితాంతము నకు। జెలగు నట్టి

విద్య గరచు వాడె । విశ్వమ్ము లోపల
ధన్య జీవి యనగ । దనరుచుండు,

క:-జీవితము కొరకు, జీవితము ద్వారా, జీవితాంతము వరకు నేర్పు విద్యకే బేసిక్ విద్యయందురా? ఆహా! ఎట్టి మహదాశయాలు!

మా:-మరియు,

ఆ॥వె॥ కాయ కష్టమందు । ఘనతను గనిపెట్టి
పనుల తోడ విద్య । బరపుచుండి
తనకు వలయు తిండి । దానె సంపాదించి
వరలు చుండు వాడె । వసుధ ఘనుడు.

ఈ విద్యకే బేసిక్ విద్యయని బిలుచుచున్నారు. ఇందు (1) ఆరోగ్య జీవనము, (2) స్వావలంబనము, (3) పరిశ్రమలు, (4) పౌర ధర్మములు (5) వైజ్ఞానిక విషయములు అను పంచ సూత్రములుచేరి మానవ జీవితమున కాధారమైయున్నది.

క:-ఈ బేసిక్ విద్యయొక్క అంతరార్థ మిప్పుడు తెలిసికొన్నాను.

మా:-అయిన లాభమేమి? నిరాడంబర జీవనముతో శాంతి సహనములు పొంది; నైతిక జీవనము సలిపి ప్రభుత్వమునకు మనము, మనకు ప్రభుత్వము పరస్పర సహాయములు సలుపుకొన్నప్పుడే, మనమూ మనదేశము బాగుపడి సర్వతోముఖమైన సౌభాగ్యముతో దులదూగగలము.

క:-అయిన విద్యా విధానములో ప్రభుత్వము వారు సమకూర్చిన సదుపాయము లేమి?

ఉ॥ "విద్య నిగూఢగుప్తమగు । విత్తము, రూపము పూరుషాళికిన్
విద్య యశస్సు భోగకరి । విద్యగురుండు విదేశ బంధుడున్.
విద్య విశిష్ట దైవతము । విద్యకు సాటి ధనంబు లేదిలన్
విద్య నృపాల పూజితము । విద్య నెరుంగనివాడు మర్త్యుడే"

అని పెద్దలు చెప్పియుండిరి గదా? ఇట్టి మహత్తర కార్యమునందు ప్రభుత్వ లక్ష్య మెట్టిది?

మా:-ఇది చాలా గొప్ప ప్రశ్న. ప్రభుత్వము గూర్చి వివరించుట నాబోటి వానికి సామాన్య విషయము గాదు. అయినను వినుము.—మనము 1947 సంవత్సరము ఆగష్టు నెల 15 తేదీని మన భారత పిత గాంధీమహాత్ముని సేవాఫలమున స్వరాజ్యమును చేకూర్చుకొని 1950 సంవత్సరము జనవరి 25 తేదీ నుండి సర్వ సంపూర్ణ స్వాతంత్ర్యముతో మన రాజ్యాంగమును మనమే నడుపుకొనుచున్నాము.

సీ॥ చిరకాల దాస్యమ్ము । జేసిన మన దేశ
శృంఖలమ్ములు తెగి । చేపడగనె,
పెక్కు సమస్యల । జిక్కియుండుట, వాని
వైదొలంగగ జేసి । వాంఛిత మగు
సర్వతోముఖమైన । జాతీయ మభివృద్ధి
సాధింపగా బూని । సహజమైన
సంపదలన్నియు । సద్వినియోగమ్ము
గూర్పగా ప్లానింగు । గూర్చియుండి,
తే॥గీ॥ రామ రాజ్యమ్ము వలె ప్రజా । రాజ్య మమరి,
గ్రామ సీమలు, మరి ప్రజా । స్వామికమ్ము
సర్వ సమమగు సంస్కృతి । జక్కబొంద,
మనదు నవ భారతమ్ము ని । ర్మాణమొందె.

మన దేశములో నెదుర్కొన్న పెక్కు సమస్యలను పరిష్కరించి, కోకొల్లగా లభించే మన సహజ సంపదలను సద్వినియోగముజేసి సర్వతోముఖమైన జాతీయాభివృద్ధిని సాధించుటకు ప్లానింగు అను ప్రణాళికలను ప్రజామోదము పొంది ప్రభుత్వము నెలకొల్పినది.

(సశేషము)

# అమెరికన్ లఘుపరిశ్రమల ప్రదర్శనం

## ప్రజల దైనందిన జీవితంలో లఘు పరిశ్రమల గురుతర ప్రయోజనాలు



మద్రాసు ఐలెండ్ మైదానంలో నిర్మించిన జియోడెసిక్ డోము (డేరా)లలో అమెరికన్ లఘు పరిశ్రమల ప్రదర్శనాన్ని ఏర్పాటు చేశారు. దానిలో 20 రకాల పరిశ్రమల తాలూకు ఉత్పత్తి, అభివృద్ధిని, పనివాళ్ల రాబడి హెచ్చుదలనూ చక్కగా ప్రదర్శిస్తున్నారు. అక్కడి కార్మిక ప్రదర్శనలో అమెరికన్ కార్మికులు ఉత్పాదనకు ఎలా దోహద మిస్తున్నారో చూపుతున్నారు. వ్యవసాయ ప్రదర్శనలో పాలు, గోధుమ సోయా బీనుల పదార్థాల విలువలను విశదీకరిస్తున్నారు.

ఆ ప్రదర్శనలోని లోహపు రేకుల విభాగంలో గ్రామ సీమలకూ, జనసంఖ్య స్వల్పంగా ఉన్న ప్రదేశాలకు ఎద్దుబండిపై సులువుగా తరలించ వీలయ్యే ఒక వెల్డింగ్ కర్మాగారాన్ని ప్రదర్శిస్తున్నారు. నాగళ్లూ, వ్యవసాయపనిముట్లూ గృహోపకరణాలు మరమ్మతు చేయడానికి ఈ సంచార కర్మాగారం బాగా పనికివస్తుంది. ఒక్క వ్యక్తి నిర్వహించ వీలయ్యే ఆ కొలిమిని ఒకచోటనుంచి మరోచోటుకు తేలికగా తీసుకు వెళ్లవచ్చును గనుక' అది భారతీయ ఆర్థిక వ్యవస్థకు ఎంతో ఉపయోగకరంగా ఉంటుంది.

బకెట్లు అన్ని రకాలైన డబ్బాలు, సూర్యశక్తి కుంపట్లు (సోలార్ ఓవెన్స్), ట్రంకు పెట్టెలు, అందమైన రకరకాల పెట్టెలు, లోహపు రేకులు తయారు చేసేందుకు పనికివచ్చే సామగ్రిని కూడా ఆలోహపు రేకుల కార్యాలయ విభాగంలో చూపుతున్నారు.

24 అంగుళాల వెడల్పుగల 16 గాజ్ లోహపు రేకును కత్తిరించగల పెద్ద కత్తెరను అమెరికాలో తయారైన పనిముట్ల ప్రదర్శనలో ఉంచారు. దానితో యంత్ర సహాయంలేకుండా చేతితోనే రేకులు కత్తిరించవచ్చును. ఆ ప్రదర్శనలో, అనుకొన్న ఆకారంలో రేకును చుట్టే లోహపు రోలింగ్ యంత్రాన్నికూడా చూపుతున్నారు. లోహపు పెట్టె తయారు చెయ్యటానికి రేకును చతురస్రాకారంగానూ, రేకు అంచులను వంచే ఫింగర్ బ్రేకును లోహపు రేకులలో 6''×6'' నాచ్‌ని 16 గాజ్ వరకూ కత్తిరించే నాచర్‌సుకూడా అక్కడ చూడవచ్చు. రేకును సూటిగా కత్తిరించటానికి, అనేక రూపాలలో తయారు చెయ్యడానికి కూడా ఆ నాచర్ పనికివస్తుంది.

లోహపు రేకు భాగాల బ్లాకింగ్, డ్రాయింగ్ 'ఎంబోజింగ్, మొదలైనవాటికి పనికివచ్చే పంచ్‌నికూడా ప్రదర్శిస్తున్నారు. అది లోహపు రేకులకు 4'' రంధ్రాలు చేయగలదు.

లోహపు రేకు భాగాలు రెండింటిని ఫ్యూజింగ్ ద్వారా వెల్డ్ చేసే స్పాట్ వెల్డర్‌ను ప్రదర్శిస్తున్నారు. సోల్డర్‌ను వినియోగించడం వల్ల అయ్యే అధికఖర్చు ఈ వెల్డర్ వల్ల ఎంతో తగ్గిపోవడమే కాక, త్వరగానూ మన్నికగానూ పని జరుగుతుంది.

ఇండియాలో లోహపు రేకు పాత్రల వినియోగం పెరిగిపోతూ ఉండడంవల్ల చిన్న తరహా పరిశ్రమ ఈ దేశంలో ఎంతో ఉపయోగకరంగా ఉంటుంది.

ఈ యంత్రాలయాన్ని సుమారు 17 వేల రూపాయలలో స్థాపించవచ్చును. దీనిని 10 మంది నిర్వహించగలిగితే, దానిలో తయారైన అమ్మకం, పంపిణీ మొదలైనవి చేయటానికి 80 మందికిపైగా కావలసి వస్తారు.

''మానవ జీవితానికి సూర్యరశ్మి బహుళ వినియోగం'' అనే ప్రాతిపదికపై అమెరికన్ లఘుపరిశ్రమల ప్రదర్శనంలో సూర్యరశ్మి వినియోగాన్ని ప్రదర్శిస్తున్నారు.

సూర్య రశ్మినుంచి ఉష్ణాన్ని, విద్యుచ్ఛక్తిని జనింపచేసేటందుకు పనికివచ్చే యంత్రాలను చూపెట్టారు. సూర్యశక్తి వల్ల అత్యధికోష్ణం జనింపచేయగలిగే మూడు పరికరాలను మొట్టమొదటి వరుసలో ప్రదర్శిస్తున్నారు. ''సోలార్ ఫర్నేస్'' యంత్రంలో బాగా పాలిష్ చెయ్యబడిన పెరబాలిక్ రిఫ్లెక్టర్ ద్వారా ఒక ఫోకల్ స్పాట్ మీద సూర్య కిరణాలను కేంద్రీకరింపచేస్తారు. అక్కడి వేడికి సాధారణ లోహాలలో చాలవరకు కరిగిపోతవి. ''హెలియో స్టాట్'' అనే కదిలే అద్దం సూర్యుడు ఆకాశంలో పయనిస్తున్నప్పుడు ప్రొద్దు తిరుగుడు పూవులాగా తిరుగుతూ ఉండే కేంద్రీకరణ పరికరం మీద సూర్య కిరణాలు పడేట్టు చేస్తుంటుంది.

రెండువేల సంవత్సరాల క్రితం ఆర్కిమెడీస్ తన దేశంపైకి దాడివస్తున్న శత్రు నౌకాదళం తెరచాపలకు నిప్పు అంటుకొనేటట్టు చేసి వారు పలాయనం చిత్తగించేటట్టు చెయ్యగలిగిన విధానాన్ని సూక్ష్మ రూపంలో తయారుచేసి ''సోలార్ షూటింగ్ గ్యాలరీ'' ని ప్రదర్శిస్తున్నారు. ప్రపంచ చరిత్రలో సైనిక యుద్ధావసరాలకు సూర్యరశ్మి ఉపయోగించిన ఉదంతం అది ఒక్కటే. గాజు, ప్లాస్టిక్‌తో తయారు చెయ్యబడిన కటకాలను ఉపయోగించి చిన్న చిన్న అత్యధిక ఫోకల్ స్పాట్‌లను ఉత్పత్తిచేసిన చిన్న తరహా కొలిములను కూడా అక్కడ ప్రదర్శిస్తున్నారు. అమెరికాలో ఆభరణాలు తయారుచెయ్యడం వంటి నగిషీ లోహ పరిశ్రమలలో వీటిని ఉపయోగిస్తుంటారు.

సూర్యరశ్మితో వంటచేసే విధానాన్ని రెండు వేర్వేరు రకాల కుంపట్ల ద్వారా ప్రదర్శిస్తున్నారు.

ఎండ బాగాఉన్న రోజుల్లో మామూలు పొయ్యిమీద వండుకొనే పదార్థాలన్నింటిని ఆ కుంపట్లమీద వండుకోవచ్చు. అవి వెంటనే 350 ఫారన్‌హీట్ డిగ్రీల ఉష్ణాన్ని జనింపచేయగలవు. వాటిని ప్లైవుడ్, గాజు, అల్యూమినంతో తయారుచేస్తారు. ఎండ కాచినప్పుడల్లా వంట చేసుకొనేటందుకు

ఆ కుంపట్లు ఎంతో సులువుగానూ, భద్రం గానూ, ఉపయోగకరంగానూ ఉంటవి.

సంవత్సరంలో చాలకాలం సూర్య రశ్మితో గృహకృత్యాలకు కావలసిన వేడి నీళ్లు కాచుకొనేటందుకు తగిన సోలార్ వాటర్ హీటరునుకూడా ప్రదర్శిస్తున్నారు. సాధారణ కుటుంబానికి కావలసిన వేణ్ణీళ్లు దానిలో కాచుకోవచ్చును. ఎండలేని సమయాల్లో ఇన్సులేటెట్ స్టోరేజ్ టాంక్‌లో వేడినీళ్లు నిలువచేసి వాడుకొంటూ ఉండవచ్చును.

సోలార్ స్టిల్స్ ద్వారా సూర్య రశ్మి ఉపయోగించి, ఉప్పు నీటినుంచి మురికినీటి నుంచి స్వచ్ఛమైన మంచి నీరు తయారు చేసుకొనే విధానాన్నికూడా చూపిస్తున్నారు. డాక్టర్ టెల్కన్ తయారు చేసిన నమూనా ప్రకారం జెట్ - హీట్ కంపెనీ నిర్మించిన ఒక స్టిల్‌ను ప్రదర్శిస్తున్నారు. ఈ రంగంలో ఇది అత్యంత ఆధునిక పరికరమనవచ్చును.

లాస్ ఏంజలెస్‌కు చెందిన హాఫ్మన్ ఎలక్ట్రానిక్స్ కార్పొరేషన్ తయారుచేసిన సూర్యరశ్మి పోర్టబుల్ రేడియో రిసీవర్లను ఇండియాలో తొలిసారిగా ఇక్కడ ప్రదర్శిస్తున్నారు.

బెల్ టెలిఫోన్ లేబరేటరీస్ ప్రదర్శనలో, టెలిఫోన్లు, చెవిటివారికి పనికివచ్చే సుశ్రవణ పరికరాలు, చిన్న మోటార్లు సూర్యరశ్మితో ఎట్లా పనిచేసేదీ చూపుతున్నారు.

సూర్యరశ్మి ప్రదర్శన అంతటిలోకి చెప్పుకోతగింది సోలార్ లిజనింగ్‌పోస్ట్. పెద్దతరహా సూర్యరశ్మి బ్యాటరీ పనిచేసే అత్యధిక శక్తిగల జెనిత్ సర్వతరంగ రేడియో సెట్‌ను అక్కడ చూడవచ్చును. ఇండియా వాణిజ్య ప్రదర్శనకోసం హాఫ్మన్ ఎలక్ట్రానిక్ సంస్థ దీనిని నిర్మించింది.

వ్యవసాయ ప్రదర్శనశాలలో ఆధునిక పద్ధతులలో తయారుచేయబడిన గోధుమ, పాలు, సోయాబీనుల పదార్థాలు ప్రముఖంగా ఉన్నవి.

అమెరికాలో పాలు, సోయాబీనులు, గోధుమ పదార్థాల ప్రయోజనాలను ప్రత్యక్షంగా తెలియచేయటమే ఈ ప్రదర్శన ప్రధానలక్ష్యం. భారతీయ వాణిజ్య మండలాలతో, సంఘాలతో ఇతోధికంగా వ్యాపార సంబంధాలు పెంపొందింప చేసుకోవడమే అమెరికా వాణిజ్య బృందం లక్ష్యం

వరి అన్నానికి బదులు అదే మాదిరిగా వండటానికి వీలయ్యే లేత బంగారు రంగు గోధుమ అన్నం బుల్గోర్ కూడా అక్కడ ప్రదర్శిస్తున్నారు. ఆ గోధుమ రవ్వను బియ్యంలో ఇష్టమొచ్చిన పాళ్లలో కలిపి మామూలు పద్ధతినే వండవచ్చును. అది పిల్లలకు, వృద్ధులకు, బలహీనులకు, విద్యార్థులకు, కార్మికులకూ అందరికీ ఎంతో బలవర్ధకమైన ఆహారం.

—(౦)—

# గీతా సందేశము

మూలము :
"అవతార్"
శ్రీ శివానంద భగవాన్

అనువాదము :
"శివానంద పాదసేవక్"
శ్రీ స్వామి శ్రీనివాసానంద సరస్వతి



ఓం నమోభగవతే వాసుదేవాయ
శ్రీ దామోదరాయ విద్మహే
వాసుదేవాయ
ధీమహి తన్నఃకృష్ణ ప్రచోదయాత్ ॥

భగవద్గీత సర్వులకు - సర్వమానవకోటి కుపకరించు విశ్వమత గ్రంథము. కేవలము "గీత" యనుచో బహువిధ గీతలు (ఉత్తరగీత, రామగీత, అవధూతగీత వగైరా) నప్పటికిని సర్వసామాన్యముగ భగవద్గీతను మాత్రమే నన్వయించును. పరమాత్మయొక్క సగుణ రూపధారియగు శ్రీ కృష్ణుని ముఖారవిందమునుండి జీవాత్మయగు ప్రాపంచికపు టర్జునుని యుద్ధరణ కొరకై వెలువడిన స్వయం వాక్కు మాత్రమే గీత. "గీత" గీతను (ప్రారబ్ధమును సంచితాగామి కర్మలతో బాటు) తప్పించుకొనుట కనన్యశరణాగతి. తానే సగుణ, నిర్గుణ, పరబ్రహ్మమనియు, సమస్త చరాచర ప్రపంచము తానేననియు దైవిక సంపత్తి, స్వధర్మ నిర్వహణద్వారా జ్ఞానచక్షువు (దివ్యచక్షువు) నొందిన వారలే నాత్మ సాక్షాత్కారమున బరగు తన దివ్య "విశ్వరూపదర్శన" మొంద నర్హులనియు నితరులెంతమాత్రము తాను మానవదేహము ధరించినప్పటికి వాస్తవికమగు తన పరిపూర్ణ దైవత్వమును గ్రహింప జాలక సాధారణ మానవవ్యక్తిగ భావింతురనియు శ్రీ కృష్ణభగవానులు స్పష్టపరిచియుండెను. ప్రకృతి రూపము, నునికివహించునట్టిదగు వివిధనామరూప జగత్తు కేవల మనిర్వచనీయమైన పరమాత్మయే తాననియు తన వ్యభిచారిణీ భక్తిచేమాత్రము పొందనగు ననియు విశదపరచెను. వివిధోపనిషత్తుల్లోని కతిపయమంత్రములు యథాతథముగను, భావ ప్రతిబింబములుగను నిందెన్నియో కాననగును. ఇది వేద సారము, సర్వశ్రుతి, స్మృతి, పురాణేతిహాసాది శాస్త్ర సంగ్రహము. గీతన పారాయణ మొనర్చుట ప్రపంచమందలి సర్వసద్గ్రంథముల లేదా సమస్త ధార్మికరచనల నధ్యయనము లేక పారాయణము మొనర్చుటయే.

క్రైస్తవులకు బైబిలు మహమ్మదీయులకు కురాను బౌద్ధులకు త్రిపిటకలు, పార్శీలకు "జెండ్ అవెస్తా" యెట్టివో హిందువులకు శ్రీ కృష్ణార్జున సంవాదమగు "భగవద్గీత" యట్టిది. ఇది పలువిదేశీ భాషలలో సహితము భాషాంతరీకరింప బడినది. ఇది శంకర, రామానుజ, మధ్వ, రాఘవేంద్రమధుసూదన, జ్ఞానేశ్వరాది పలు ఆత్మ సాక్షాత్కార పురుషులచే వ్యాఖ్యానింపబడినది. అధునాతనమున తిలక్, సాత్వలేకర్, గాంధి, మాలవ్యా, వినోబా భావేమున్నగు నెందరెందరో ఆస్తిక మహావ్యక్తుల భాష్యములను చవిచూడదగినవి. సర్వఖండ ఖండాంతరములోను యూయుల మన్ననలంది వివిధ భాషలలో వందలకొలది వ్యాఖ్యానములతో సదానొప్పారుచున్న మహద్గ్రంథమిదియే.

వరాహపురాణము, వాయుపురాణము మున్నగు వాటియందలి గీతా మహాత్మ్యమును పరికింపుడు. గీతయందలి 18 అధ్యాయములకు పద్మపురాణమందు గల పదునెనిమిది మహాత్మ్యసంబంధ కథల తిలకింపుడు అష్టాదశాధ్యాయమందలి చరమ శ్లోకముల గమనింపుడు. భగవానుని వెవ్వేరు ప్రతిజ్ఞల జ్ఞప్తియుంచుకొనుడు. వివిధగీతోపాసకులపై భగవత్కృప యెటుల ప్రసరించినదో గమనింపుడు. ఇదంతయు గీతామాత్మ్యమే, ప్రాభవమే ఘనితయే. గీతను పారాయణ మొనర్చుటన సార్ధత్రికోటి (మూడుకోట్ల యేబదిలక్షల) తీర్థములలో గ్రుంకులిడుటయే. ముప్పది మూడుకోట్ల దేవతల నారాధించుటయే. సప్తకోటి మహామంత్రముల జపించుటయే. సమస్తయోగముల నభ్యసించుటయే. గోమాతను, భూమాతను శ్రీకృష్ణభగవానుని, వేదవ్యాసుల శ్రుతి, స్మృతి, పురాణేతిహాసాది సమస్త శాస్త్రముల, సమస్తయోగుల, మునుల, సిద్ధుల, పరమభాగవతుల, మహర్ష్యాదుల పూజించుటయే. గీతయందు విశ్వాసము లేకపోవుటన శ్రీ కృష్ణపరమాత్మయొక్క ఉనికియందు విశ్వాసము లేకపోవుటయే శ్రీ కృష్ణ

భక్తులద్వేషించుటయే. గీతామృతమనెడి యౌషధ సేవను ప్రాపంచిక చిత్తులుపేక్షించుటన జీవిత లక్ష్యమైన జనన మరణరహితమగు మోక్షమున కద్వారనామమగు నాత్మ సాక్షాత్కారము లేదా శ్రీకృష్ణ విశ్వరూప సందర్శనమును లేదా శ్రీ కృష్ణుని కాల్దనుటయే లేదా సంసారరోగమునంత కంతకు పెంపొందించుకొనుటయే. ప్రస్థానత్రయము (ఉపనిషత్తులు బ్రహ్మసూత్రములు, భగవద్గీత)లో గీతయొకటి. గీతసన్న్యాసులకు మాత్రమే నుద్దేశింపబడిన దనుకొనుట వివేకము, దురూహ, ఆత్మవంచన మాత్రమే. ఆధ్యాత్మిక మనసులు గీతామాతను సేవింపకపోవుటన నాత్మహత్య చేసుకొనినటులేయగును.

సర్వులు - బ్రహ్మచర్య, గృహస్థ, వాన ప్రస్థ సన్న్యాసులు-బ్రహ్మ క్షత్రియ, వైశ్య, శూద్రులు, స్త్రీ, పురుషులు, బాల బాలికలు వీరు వారనక దేశ కాల, వయోభేదము లేక నిరాఘాటముగ పఠింప నగును. పరమాత్మ యందటి సొత్తునెటులో నటులే గీతయు కూడను. గీత శ్రీ కృష్ణుని లేదా పరమాత్మ యొక్క స్థూల, దృశ్యరూపము మహిళాభక్తురాలగు పిళాబాయికి భగవానుడు తన స్థూలరూపమే "గీత"యనియు "గీతా"నారాధించుటన తన నారాధించుటయేననియు స్వయముగా తెలుపలేదా? దేశకాలలింగ, వయోజాతి, భేదములో నిమిత్తములేకుండ సమస్త లౌకిక నైతిక, శారీరక, మానసికాధ్యాత్మికమగు సమస్యల కన్నింటికి చక్కని సమాధానకారి క్లిష్టజీవిత పరిష్కారిణి, శాంతి ప్రదాత్రి మోక్ష ప్రసాదిని. గీతోపాసకులు పారాయణతో బాటాచరణను కూడ మేళవింపానర్చుచో వారు జీవన్ముక్తులగుట కెట్టి సందియములేదు.

భగవానుడు సహితము "నేను కర్మలనొనర్తును. కాని నిర్లిప్తుడ, నసంగుడ, బంధరహితుండ, లోకులు నే నొనర్పనిచో కర్మల విడుతురనుటలో నుద్దేశ్యమేమి? తాను సారథ్యమువహించుటలో, దైన్యమొందిన నర్జునుని యుద్ధముచేయుటకై ప్రోత్సహించుటలో నంతరార్థమేమి? కర్మల తప్పనిసరిగ చేయుమనుట, స్వధర్మము నిర్వహింపమనుట గాదా? అటులగుచో నిత్య, దైనందిన కర్మలానర్చుచు సంగులు, బంధ రహితులు, నిర్లిప్తులై సాధ్యాత్మికోన్నతికై వాటిని దైవికానుష్ఠానముగ నొనర్చు (divinise) టెట్లు కాదు; క్రోధలోభాది యరిషడ్వర్గము, స్వార్థపరత్వము, యమనియమ రాహిత్యము, కుటిలత, వక్రత్వము, కర్తృత్వ, భోక్తృత్వ భావన, అహంమమతలు సంపూర్తిగ విడనాడి విశ్వప్రేమ, ఉదారత ధర్మశీలత, న్యాయము, ఆస్తికతమున్నగు దైవికసంపత్తితో నొప్పారుచు తాను భగవత్ప్రేరితుడై కర్మ చేయుట కధికారుడేకాని కర్మఫలమునకు గాదని పదేపదే గ్రహించి నిమిత్త మాత్రుడగు సాక్షిభావముతో ప్రకృతి నాటకముగ నెఱింగి కూటస్థుడై, ఉదాసీన, అనాసక్తి నిర్లిప్త భావముతో ధర్మబద్ధముగ, గురు దైవశాస్త్రానుసారముగ జీవితము గడుపుటయే. ప్రాపంచిక వ్యవహారములో ప్రాపంచికతను అనగా రజోతమోగుణ వికారములగు నాసురిక సంపత్తును మినహాయించుచో నుండునది దైవికసాధన (అనుష్ఠానము) మాత్రమే. (wordly activity Minus Worldliness—Sadhana) అప్పుడు లేచునది మొదలు నిద్రించువరకు చేయు ప్రతి నిత్యకార్యక్రమమును నూటికి నూరుపాళ్ళుగ, రూపాయికి 16 అణాలు వంతున ననుష్టానము లేదా సాధనగ పరిణమిల్లును. ఆహా! సంసారమగ్నులకెట్టి గీతయొక్క మహోద్బోధ!

గీతబోధించునది సమన్వయయోగమే (Integral or Synthetic Yoga). అనగా కర్మ, భక్తి, యోగ, జ్ఞానముల సమ్మేళన పంథాయే. గీతాపారాయణ, ఉపనిషత్పారాయణ, వేదావేద పారాయణ లేదా బ్రహ్మయజ్ఞముతో సమానము. గీత ఉపనిషన్మంత్రమయమైనది. గీతయొక్క 18 అధ్యాయములలో ప్రతి యొక్కటి తైత్తిరీయ, బృహదారణ్యక, ఛాందోగ్యాదుల వంటి యుపనిషత్తే. ఇది బ్రహ్మవిద్య (అధ్యాత్మజ్ఞానము), యోగశాస్త్రము కూడను.

గీతలోగల 18 అధ్యాయములలోని శ్లోకముల మొత్తము 791. దీనిని పూర్తిగా పఠించుటకు నూతనులు లేదా ప్రారంభకులకు (beginners) కేవలము రెండు (2) గంటల కెక్కువకాలము పట్టదు. నిత్య పరిచయ లేదా నలవాటుపడిన పాఠకులకు (habitual readers) 18 అధ్యాయముల లేదా 701 శ్లోకముల పారాయణాక గంటన్నర (ఒక గంట 20 నిమిషములు) లోపుగ పూర్తియగును.

ఇటనా (శివానందా) శ్రమమున ప్రతి శుక్ల, కృష్ణ పక్ష యేకాదశులందు నుదయ మారు గంటలవరకు (6 A.M, to 6 P.M.) నొకరి తరువాత నొకర ఖండ గీతా పారాయణ మొనర్తురు. అఖరున పఠించు వారనగా సాయంత్రము 5 గంటలనుండి 6 గంటలవరకు

పఠించువారు 18వ అధ్యాయముతో సూత్రము ముగించవలెను. కాన కొండొక పరిశ్రమయైనను నటు లొనర్చి తీరుదురు. ప్రతియొక్కరు తమకు విధింపబడిన నొక గంట లేదా నంతకెక్కువ పరిమితి (వ్యవధి) యైన తరువాత తాము పూర్తిచేసిన నధ్యాయము తదుపరినుండి కొనసాగింప తమ తరువాతి వారి కప్పగించి తాము గీతామాహాత్మ్యమును చదువక మానరు.

మీకను దినమున నొక సంపూర్తి పారాయణము కుదరనిచో నెలకు రెండు పర్యాయములు లేదా నొక పర్యాయమైన నేల యొనర్పరాదు? ఆదివారము లేదా! సెలవు దినముల నాడే యొక పర్యాయముగ నఖండముగ, సంపూర్తిగ 2 గంటల కాలము త్యాగ మొనర్చి యొకరొకరికిని నిరవాంతర (unobstructed) పారాయణ మొనర్పుడు. లేదా! నింకను నుత్తమముగ బ్రహ్మముహూర్తమున (తెల్లవారు జామున 3.30 A.M. నుండి 5.30 A.M. వరకు) నొక గంట రాత్రి యొక గంట స్వాధ్యాయ (పారాయణ) మొనర్చి దినమున కొక అష్టాదశాధ్యాయీయావృత్తి (complete of round of Parayan) నొనర్పుడు. సినీమాలకై దుర్వినియోగ పరచు మూడుగంటలలో నాత్మోద్ధారణకై మన నుంచుచో నెలకొక పరియైన 2 గంటలు సద్వినియోగ పరుపనే పాటి లెక్క! మీరు సంపూర్తి గీతను 1, 2 సం॥ల వ్యవధిలోనైన కంఠస్థ మొనర్పుడు. మీ పిల్లలచే బాల, బాలికచే కంఠస్థ మొనర్పచేయుడు. పెద్దవారి కంటెను చిన్నపిల్లలతి త్వరగ నీయమోఘ కార్యమును సాధింపగలరు. 18 అధ్యాయముల పారాయణనను దిన మొనర్ప వీలు కుదిరనిచో దినమున కొక శ్లోకమైన తప్పనిసరిగ నర మాహాత్మ్యములతో బఠించి నిత్యజీవితములో నాచరించి గీతోపాసకులై శ్రీ కృష్ణపరమాత్మానుగ్రహము నకు పాత్రులై మోక్షసామ్రాజ్యము నీజన్మముననే ననుభవింతురు గాక!

జాతీభావములో ప్రప్రథముగ తెలుగున శ్రీ నంబూరి వేంకటసుబ్బారావుగారిచే, దక్షిణ వీధి, ఏలూరి (పశ్చిమ గోదావరి జిల్లా) ననువదింపబడిన ప్రచురింపబడిన నీ దివ్యజీవన సంఘ (శివానంద నగరము) పు గీతాభాష్యమాంధ్ర ప్రదేశమున, సర్వత్ర ప్రజానీకమును గీతాసక్తుల, గీతానురక్తుల గీతాచైతన్యమయులుగ నొనర్చుగాక!

బోలో గీతా మాయీకీ జయ్!
బోలో సనాతనధర్మ్ కీ జయ్!
బోలో గీతా ప్రేమియోంకీ జయ్!
బోలో విశ్వకోటికీ జయ్!

---



---

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

తృతీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(జూలై సంచిక తరువాయి)

౨౧

మెఱపు కరణిఁ బ్రకాశించు, మేటిమకర
కుండలములచే, శోభిల్లు - గండభాగ
ములను కల్గిన శ్రీరామ! ముద్దుగులుకు
రతన మకుటంబుచేత, విరాజమానుఁ
డగుచుఁ బీతాంబరముదాల్చి, నిగమవినుత!
జలదనీలశరీర! శ్రీ జానకీ, మ
నోహరా! గొప్పకాంతితో, మోహనుండ
వగుచునున్నావు; సేవింతునభయమిమ్ము

౨౨

పద్మదళనేత్రములవాఁడు, భద్రమూర్తి
చాపహస్తుండు, చారు హాసంబువాఁడు
నీల నీరద రూపుండు, నిర్మలుండు
జానకీ ప్రాణనాథుండు, కాననముల
సంచరించిన ధీరుండు, సాహసము, ప
రాక్రమోపేత వేషుండు, రామ చంద్ర
మూర్తి; సౌందర్యగాత్రుండు, ముదము
జెలఁగ
మన్ననో వీథి విహరించి - మనుచుగాత!

౨౩

భూభారమును, మాన్పగా, భక్తియుక్తులై
దేవతల్ నిన్నుఁ బ్రార్థింప, సూర్య
వంశంబునన్ బుట్టి - వర్ధిల్లి నాఁడవు
మాయామనుష్యుఁడై, మహిమతోడ
రాక్షసులనుద్రుంచి, రామచంద్రా! నీవు
జనముల పాపముల్ - సంహరించి
బ్రహ్మస్వరూపంబుఁబడసిన వాఁడవు
స్థిరమైన సత్కీర్తిఁజెందినావు
జానకీమనోహర! వికచారుణాబ్జ
చరణయుగములు గల్గిన - సార్వభౌమ!
నిన్ను సేవింతు, భజియింతు నిష్ఠతోడ
నన్ను రక్షింపుమయ్య! సంపన్న చరిత!

౨౪

మా కాశ్రయుండవై - మాయాశ్ర
యుండవై
మాయఁబోనడచెదు - మహితుఁడీవు!
ఉద్భవంబు. స్థితి, లయోత్పాతములకెల్లఁ
గారణభూతుఁడై గ్రాలు దీవు!
ఆనంద సాంద్రుఁడై - యనులుఁడై,
జ్ఞానస్వ
రూపుఁడై - వెలుగొందురూపుఁడీవు!
తత్త్వవేత్తుఁడయి, సీతామనోనాథుఁడై
అద్వితీయుండయి - యలరు దీవు!
రామచంద్ర! నీవె! రక్షకుండైనావు
నిన్నునమ్మినట్టి - నిర్మలులకు
భయములేదు, రాగబంధముగనరాదు
అభయమిచ్చి, ప్రోవుమయ్యా! వరద!

౨౫

కోటిభాస్కర తేజ! కువలయాలంకార!
రత్నకుండల ధారి! రామచంద్ర!

కీర్తిలక్ష్మికినీవు - మూర్తిస్వరూపుఁడై
అభయమొసఁగునట్టి యాదిదేవ!
అవతారమూర్తివి! రవివంశదీపకా!
ముక్తిఁజే కూర్చెడి శక్తివీవె!
శిష్టుల రక్షించి, దుష్టుల శిక్షించు
రక్షామణివి నీవు రామచంద్ర!

శ్రీ శుభాంగ! వరద! చిన్మయ! రఘురామ
అచ్యుతా! ముకుంద! హరి! మురారి!
సారసాక్ష! జానకీరమణా! నీదు
స్మరణ నాకొసంగుమా - సతంబు

౨౬

మానస భృంగమా! మందారసుమములో
మకరంద రసమొందె ప్రకటితంబు;
దాన, నేమిఫలము? ధర్మార్థకామమో
క్షములనెడు, పురుషార్థములు నాల్గు
రసములు శ్రీరాము - రాజీవచరణ, యు
గ్మమునందు శోభిల్లు; మధుపమా? చ
పలమేల? శ్రీరామపాదపద్మంబులఁ
జేరుము; మధువును గోరిగ్రోలు

మా? విచారమేల? మానస దుఃఖంబు
లడఁగు! ముదముగల్గు వెడగుమాను;
భృంగ జన్మమది తరించు! నిక్కంబిద్ది
మనస! వేరు తలపు జనదునీకు.

౨౭

రాముండు సతతంబు రక్షించు, శత్రుభ
యంబును బోనాడి యధికరక్తి
రామునిధ్యానింతు; రామునిచే గొప్ప
యజ్ఞానతిమిర సంహరణమాయె
రామునికై, యహరహము నేఁగాంక్షింతు
రామునికంటె, పరంబు లేదు

రామునియందు విశ్రాంతి నా భక్తి; శ్రీ
రామునకునమస్కరక్తితోడ
ఓయి! శ్రీరామ! వేగరావోయి! నీదు
ముద్దు నెమ్మోము జూడంగ ముదముగల్గె;
నీ చరణసేవనాకిమ్ము; నీరజాక్ష!
జానకీనాథ! శ్రీరామ! జాగువలదు.

౨౮ (a)

నల్ల కలువఁబోలు - నలుపు దేహమువాఁడు
కమలలోచనుండు - కమలహితుఁడు
భక్తినొక్కమాఱుప్రార్థించినఁ జాలు
రక్షసేయఁగల్గు రాఘవుండు

౨౮ (b)

జ్యానినాదమింత శ్రవణ గోచరమైనఁ
జాలు, రాక్షసాళి సమయుచుండు
నట్టి చాప మూనినట్టి, శ్రీరఘురాము
నాశ్రయింతు సతము నధికభక్తి,

౨౯

దివ్యధనువు చేతఁదేజస్స్వరూపుఁడై
భుజబలంబున, రౌద్రము, గనబఱచి
భ్రూకుటితాస్యుఁడై - రోషకషాయత
నేత్రుఁడై, సిద్ధతూణీరమందు
నిర్విరామంబుగా - నిగనిగల్ మెఱయుచు
వచ్చు బాణంబులఁబట్టి, శత్రు
నివహంబు మర్దించి, రవివంశతిలకమా!
దశకంఠుఁద్రుంచిన దాశరథివి!

వీరలక్ష్మి మనోహరాకార! శూర!
ఇంద్రుఁడెప్పుడు నినుస్తుతి యించుచుండు
వీరరాఘవ! శ్రీపతీ! వినుతి సేతు
రక్షసలుపుము; శ్రీరామ రాఘు! వేంద్ర!

(సశేషము)

# కాంతిమతి

స్వేచ్ఛానువాదం: శ్రీ ఆకుండి వేంకటశాస్త్రి

అనుసరణ: శ్రీ సి. సి. పున్నయ్య

కాంతిమతి, భానుమతి బాపిరెడ్డిగారి అనుంగు బిడ్డలు. బాపిరెడ్డి సంపన్నుడగుటచే వారిద్దరు అల్లారు ముద్దుగా పెరుగుచుండిరి. కాంతిమతి, భానుమతి - యిద్దరు రూపలావణ్యములు గలవారైనా కాంతిమతి మోహినిని మరపించు సౌందర్యరాసి; కాని ముక్కోపి. ఆవేశ, ఉద్రేకాలతో ఎదటివారిని భయభ్రాంతులను చేయుచుండెడిది. ఆమెను కలహకంఠియనియు, గయ్యాళి గంపయనియు యూరునాడు చెప్పుకొనుచుండెడిది. రెండవ కుమార్తె భానుమతి సౌందర్యముతో బాటు సౌశీల్యము, వినయవిధేయతలు కలిగియుండెను. కాంతిమతి రూపలావణ్యములను చూచి అనేకమంది యువకులు వివాహమాడ మోజుపడినా ఆమె రాకాసితనానికి బెదరి భానుమతిని వివాహమాడ సమ్మతించెడివారుకాని కాంతిమతిని వివాహడ తలచువారు కారు.

బాపిరెడ్డికి చాలకాలము తన పెద్దకుమార్తెకు ఎట్లు వివాహమగునాయని విచారపడుచు, ఆమెకు వివాహమయిననే కాని భానుమతికి వివాహముచేయ తలచనట్లు నిశ్చయించుకొనెను. దాని ఫలితముగా భానుమతిని వివాహమా చేసికొనదలచిన వారెల్లరు అడవి పిల్లివంటి క్రౌర్యవతియగు కాంతిమతికి ఎవ్వడు వివాహసంబంధము దొరకునాయని ఎదురుచూచుచుండిరి.

కొంత కాలమునకు పరశురామ రెడ్డియను భూస్వామి-యువకుడు తనకు యీడు, జోడు అయిన వివాహసంబంధమునకై విచారింపసాగెను. అతడు ధైర్యశాలి, మంచి బలసంపన్నుడు. అతనిలో ఎదటివారెట్టివారైనను ఆకర్షించగల శక్తి, వాక్చాతుర్యముండెను. ఇతని మానసప్రవృత్తి చాల విచిత్రమైనది. ఒకొక్కప్పుడు అతనికి కోపమువచ్చేనేని పిచ్చివానివలె ప్రవర్తించి యితరులను భయకంపితులను చేయును. ఇట్టి వికారచేష్టలున్నను అమోఘమైన తెలివితేటలు గలవాడు.

పరశురామరెడ్డి కాంతిమతి సౌందర్య లావణ్యములనుగురించి వినెను. ఆమె పుట్టింటివారి ధనధాన్యసంపదలను గురించి తెలిసికొనెను. బాపిరెడ్డి తన కుమార్తెకు తగిన వివాహ సంబంధమునకై పారజూచుచున్నట్లు తెలిసికున్నాడు. దాంతోబాటు ఆమె పైశాచిక ప్రవర్తనను గురించి విన్నాడు కాని తాను ఆమెను ఎలాగైనా లాలించి, ఒప్పించి వివాహమాడగలననే ఆత్మవిశ్వాసముతో బాపిరెడ్డిగారింటికి వెళ్ళి, కాంతిమతిని తాను వివాహమాడ దలచినట్లు ఆయనతో చెప్పాడు.

బాపిరెడ్డికి పరశురామరెడ్డిగారి కుటుంబమును గురించి, ఆస్తిపాస్తులనుగురించి, అతని స్వభావమును గురించి తెలిసియుండుటచే తన కుమార్తెనతనికిచ్చి పెండ్లిచేయుట కభ్యంతరము లేకపోయినా కాంతిమతి స్వభావమును దృష్టిలోనుంచుకొని విచారముతో "మా కాంతిమతి మిమ్ముల వివాహమాడ తగదని భయపడుచున్నా"ననెను.

"అయితే మీ యమ్మాయికి వివాహంచేయదలచుకున్నట్లు లేదుమీరు! ఒకవేళ నావంటివాడు మీకు అల్లుడు కావడం యిష్టమైనా లేకుండాలి!" అన్నాడు పరశురామరెడ్డి.

"నీవు అల్లుడగుట నాకు సంతోషమే. కాని కాంతిమతి మీకు వినయవిధేయతలు గల భార్యకాగలదనే ధైర్యము నాకు లేదు. ఆమె వికృతప్రకృతి నాకే భయము కలిగిస్తుంటుంది" అన్నాడు బాపిరెడ్డి.

బాపిరెడ్డి, పరశురామ రెడ్డి హాల్లో యిలాగ కూర్చొని మాట్లాడుకుంటుండగానే ప్రక్కగదిలో నుండి కాంతిమతికి సంగీతము చెప్పుచుపాధ్యాయుడు తలపైని గాయమునుండి రక్తము స్రవించుచుండ భయకంపితములతో బయటికి వచ్చాడు.

"ఇదేమిటి మాష్టరుగారూ! యీగాయం ఏమిటి - నెత్తురేమిటి_ఏమి జరిగిందేమిటి? మా అమ్మాయికి సంగీతము పాఠాలు బాగావస్తున్నవా" అని ఆరుద్రాతో లేచి అడిగాడు బాపిరెడ్డి.

సంగీతము మాష్టరు పైగుడ్డను రక్తము కారుతున్న గాయమునకు అదిమిపట్టుకొని "సంగీతము పాఠముల

కేమి లేండి!—మన అమ్మాయి ఏనాటికైనా యుద్ధరంగమున విహరించగల వీరవనిత కాగలదు. అంతే కాని నేనికమాత్రం ఆమెకు......చెప్పలేను బాబూ!" అంటూ బయటికి బయలుదేరాడు.

"అది కాదు మాష్టరుగారూ! ఏమి జరిగిందేమిటి!" అంటూ వెంబడించాడు బాపిరెడ్డి.

"ఏముంది రెడ్డిగారూ! యింతకాలం తిట్లు, రంకెలతో కాలంగడచి పోయింది – యీరోజున నిష్కారణంగాఫిడేలు తీసికొని తలమీద కొట్టింది అమ్మాయి" అనిచెప్పి వెళ్లిపోయాడు.

ఈ దృశ్యాన్ని చూచిన పరశురామరెడ్డికి వింతగా తోచింది.

"అయితే మీ కాంతిమతి ధైర్యసాహసాలు నాలో ఆమెను పెండ్లిచేసి కొనవలెనను పట్టుదలను యినుమడింపజేసినవి. ఆమెతో పరిచయ సంబంధముల కలిగి ఆమెను సాధుశీలగా ఉత్తమగృహిణిగా, ప్రేమమూర్తియైన భార్యనుగా మార్పించగలననే ధైర్యమున్నది" అని కాంతిమతి స్వభావమును మార్చుటకు మార్గాలకొరకు మనసు తీవ్రంగా పనిచేయ సాగింది. అప్పటినుండి పరశురామరెడ్డి తరుచుగా బాపిరెడ్డిగారి యింటికి వస్తూపోతూ కాంతిమతితో కల్పించుకొని మాట్లాడసాగాడు.

"కాంతిమతి నన్ను నిందింప సాగెనా! . ఆమెను 'నీవు భరతపక్షిలాగ పాడగలవు' అని పొగడెను. ఆమె ముఖముపై కోప తాపములు తాండవించినప్పుడు మంచు బిందువులతోనున్న ప్రాతఃకాలపు గులాబి గుచ్ఛమువలె ఆమెమోము వికాసవంతమైయున్నదని పొగడెదను. ఆమె మౌనముతో నున్నపుడు ఆమె వాక్చాతుర్యమును వాక్మాధుర్యమునుగురించి స్తోత్రముచేసెదను. ఆమె నన్నవతలికి పొమ్మని గర్జించినచో "పెండ్లాడుట కొక వారము రోజులుండమన్నావా!"యని అడిగెదను. ఆమె నన్ను పెండ్లాడనంటే "ఐతే వారమునకా పెండ్లి" అని అడుగుతాను. అని లోలోన అనుకొనుచుండగానే కాంతిమతి బయటికి వచ్చి "ఏమిటీ! — ముక్కూ, మొగము తెలియని వ్యక్తినన్ను చూడాలనాయంటాడు!" అని గర్జించే సరికి పరశురామ రెడ్డి లేచి "నమస్కారాలు కాంతీగారికి—మీ పేరు...?" "నాపేరు కాంతిమతి. నన్ను పేరుపెట్టి ఎవరు పిలువరు." అన్నది.

"నీవు అబద్ధమాడుతున్నావు" అన్నాను పరశురామరెడ్డి.

"నీవు కాంతివే—నా ప్రియమైన కాంతివి —. నీవు ఒక్కొక్కప్పుడూ యీ సంఘమున ప్రకుపిత కాంతవనిపించు చుంటావు - నీచక్కదనమును, సామర్థ్యమును, నీ సద్గుణ సౌశీల్యములను ఎల్లెడ కీర్తించుచుండగా నిన్ను వివాహమాడవచ్చితిని" అన్నాడు పరశురామరెడ్డి తనకు ఆమెపై-గల ప్రేమను ఒలకబోస్తూ.

పరస్పరానురాగం క్రమంగా అంకురించి బలీయముకా జొచ్చింది. కాని కాంతిమతి సహజధోరణిలో ఒక్కొక్కప్పుడు రుసరుసలాడేది; నిప్పులు గ్రక్కేది; తిట్టేది – కొట్టబోయేది కూడాను. అయినా పరశురామ రెడ్డి పరమశాంత స్వభావము ప్రదర్శించేవాడు. ఆమెతో ఏనాడు కలహించ పూనుకొనేవాడు కాదు. ఆమె చీకాకుకు, దురుసుతనానికి చాలవినయ విధేయతలతో జవాబిస్తూ ఆమె సౌందర్యాన్ని స్తోత్రముచేస్తూ, లోకమంతా ఆమెను కోపిష్ఠియని అబద్ధమాడుతున్నదనేవాడు.

బాపిరెడ్డితో ఒకనాడు పరశురామరెడ్డి కాంతిమతిని తాను రానున్న ఆదివారమునాడు వివాహమాడనున్నాననియు, ఏర్పాట్లు చేయించవచ్చుననియు చెప్పటవిని కాంతిమతి బెబ్బులివలెవచ్చి "ఆదివారమునాడు నిన్ను ఉరితీయించ బోతున్నాను" అని పరశురామరెడ్డిపై గర్జించెను.

తండ్రివైపు తిరిగి పరశురామరెడ్డివంటి పిచ్చివానికి తన్నిచ్చి పెండ్లిచేయ తలపెట్టినందుకు తిట్టిపోసింది.

కలవరపాటుతోనున్న బాపిరెడ్డితో పరశురామరెడ్డి "మీరేమి కంగారు పడకండి! మీ సమక్షంలో నామెయిట్లే మాట్లాడును. మేమే కాంతముగానున్నప్పుడు నన్ను కాంతిమతి ఎంతగానో ప్రేమించి ఆదరించును" అని, కాంతిమతితో "ప్రేయసీ! నీకు మన వివాహ సందర్భమున కావలసిన ఆభరణాలు, చీరెలు,అంగుళీయకములు తెచ్చుటకు వెళ్ళుచున్నాను. వివాహమిందుకు విపుల ప్రయత్నాలు చేయుచున్నాను. మన బంధుమిత్రులందరిని వివాహమునకు పిలవాలి" అని చెప్పి పరశురామరెడ్డి వెళ్లిపోయాడు.

అది ముహూర్తం రోజు. కాంతిమతి చక్కగా అలంకరించబడి అప్సరసలాగ నొప్పింది. బంధుమిత్రులతో యిల్లంతా కోలాహలంగానున్నది. ప్రతియొక్కరు పెండ్లికొడుకు రాకకు ఎదురుచూడసాగారు. కొందరప్పుడేగుసగుసలు ప్రారంభించారు.

బాపిరెడ్డి ముహూర్తకాలం సమీపింస్తున్నను వరుడు రాకుండుటవలన చీకాకుపడుచుండెను. కాంతిమతి ఆకలిగొన్న సింగములాగ నిప్పులు గ్రక్కుచుండెను. ఆ సమయంలో పరశురామరెడ్డి తెగిపోయిన జీనుతో, బక్కచిక్కిన గుర్రముపై ముష్టివానివలె చింకిపేలికల దుస్తులతో వచ్చి దిగెను. అతనివెంట నొక సేవకును విదూషకుని దుస్తులతో వచ్చెను.

గుర్రము దిగుతూనే "నా ప్రియురాలు కాంతిమతి ఏదీ!" అంటూ యింట్లోకి ప్రవేశింపబోయాడు, తనకు కానున్న అల్లుడు చింపిపేలికల దుస్తులలో నుండుట సహింపలేక "ముందువెళ్లి దుస్తులు మార్చుకొని రమ్ము" అనెను బాపిరెడ్డి గర్జించి.

పరశురామరెడ్డి "ఈ సందర్భమున ఎరువు తెచ్చుకొన్న దుస్తులు ధరించుట నాకిష్టములేదు. నేనీ చినిగిన దుస్తులతోనే కాంతిమతిని వివాహమాడెదను. ఆమె నన్నుగాని, నా దుస్తులను కాదు కదా వివాహమాడబోవునది!!" అనెను.

ఇక అతనితో వాదించి లాభము లేదని దేవుని సన్నిధిలో కాంతిమతికి, పరశురామరెడ్డికి వివాహము జరిగెను. పెండ్లి జరుగుతున్నంత సేపు పరశురామరెడ్డి వెర్రి అరపులు, వెకిలిచేష్టలు కాంతిమతిని ఆయోమయంలో ముంచివేసెను. పెండ్లి అయికాగానే అతిధులు విందుకు కూర్చొనబోవుచుండగా పరశురామరెడ్డి, మాత్రం తాను, కాంతిమతి విందులో పాల్గొనమని చెప్పి కాంతిమతిని తనతో ప్రయాణము కమ్మనెను.

కాంతిమతి దీనంగా "మీరునన్ను నిజంగా ప్రేమిస్తుంటే విందులో పాల్గొనాలి" అన్నది.

పరశురామరెడ్డి ఆమాటలు లక్ష్యముచేయక రెండు గుర్రములను తెప్పించి కాంతిమతిని తన వెంట రావలసినదిగా ఆజ్ఞాపించెను.

కాంతిమతి "నేను రాను. మీరు వెళ్లవచ్చును. నేను కోరునట్లు నాతోబాటు యిక్కడ కొంత కాలముండవలెను" అన్నది.

పరశురామరెడ్డి "కాంతిమతీ! విందులు, వినోదాలు అతిధులకొరకు. నా ప్రియురాలు నాఅదుపాజ్ఞలలో నుండవలసినది. బయలుదేరు" అన్నాడు. ఇద్దరు గుర్రముల నెక్కి పరశురామ రెడ్డిగారి గ్రామమునకు వెళ్లిరి.

ప్రయాణబడలికతో కాంతిమతి బాగా అలసిపోయింది. దంపతులిద్దరు ఆకలితో నకనకలాడుచు యిల్లుచేరారు. ఇల్లుచేరగనే పరశురామరెడ్డి బంధుపరివారము స్వాగతం చెప్పారు దంపతులకు. కాని పరశురామరెడ్డికోపోద్రిక్తుడై పరివారమును దూషించసాగాడు. కాంతిమతి భర్తను వారిస్తూ నౌకర్లను సాదరముగా చూడవలసినదిగా కోరింది. తమ ముందు తెచ్చిపెట్టిన భోజనపదార్థములను పరశురామరెడ్డి అనేక వంకలుపెట్టి తినక లేచిపోయెను. కాంతిమతి వానిని రుచిచూచి అన్నియు బాగుగానే యున్నవని తిన నారంభించెను. ప్రయాణపు బడలికచే. వెంటనే పరుండి నిద్రపోయెను.

అప్పటినుండి కాంతిమతికి భోజనవసతులు సకాలమున కమరేవికావు. ఆమె ఆకలిబాధకు తట్టుకోలేక నౌకర్లచే చాటుమాటుగా కావలసిన భోజనపదార్థములను తెప్పించుకొని తినవలసివచ్చెను. పరశురామరెడ్డి తన నౌకర్లకు "నా ఎరుకలేనిదే ఆమెకు ఏమి తెచ్చి పెట్టవద్దని" ఆజ్ఞాపించెను. కాంతిమతి విలపిస్తూ "ఏమిటిదంతా! నాకు తిండి సయితము పెట్టక నన్ను చంపడానికా మీరు నన్ను వివాహమాడింది? నేను అన్నపానాదుల కెప్పుడు యిలాగ అలమటించి ఎరుగను. మీరిలాటి ప్రవర్తనతో నన్ను ఎంతగానో ప్రేమిస్తున్నట్లు నటించడం కపటంగా కనుపిస్తున్నది" అన్నది.

ఒకనాడు పరశురామరెడ్డి స్వయంగా తాను తయారుచేసిన ఆహారపదార్థముల పళ్లెరమును తెచ్చి కాంతిమతి ముందుపెట్టి "వీనిని నేను స్వయముగా నీకని తయారుచేసి తెచ్చాను. ఇవి నాప్రేయసికెట్లు రుచించునో!" యనెను.

కాంతిమతి మారు మాట్లాడకమిన్నకుండెను. అది చూచి నౌకర్లనుపిలచి "ఆమెకవి అక్కరలేనట్లున్నది. పళ్లెరమును తీసికొని పొండు" అనెను. కాని ఆకలితో దహించకపోతున్న కాంతిమతి ఆపళ్ళెరము నక్కడనే యుండనిమ్మనెను.

"ధన్యవాదాలు ప్రియా! ఆకలితోనే నాకు సాధుస్వభావము అలవడినది" అనెను మెల్లగా.

అప్పటినుండి కాంతిమతిలో విప్లవాత్మకమైన మార్పు కనుపించసాగెను. ఆమెలోని దురుసు

తనము, కోపము, అఘాయిత్యము మరుగుపడిపోజొచ్చి సాధుస్వభావము పెంపొందెను.

కొన్నాళ్ళకు పరశురామరెడ్డి కాంతిమతితో మామగారి యూరికి బయలుదేరెను. మిట్ట మధ్యాహ్న సమయంలో మండుటెండలో ప్రయాణంచేస్తూ పరశురామరెడ్డి" కాంతీ! యీ చల్లని వెన్నెల ఎంత ఆహ్లాదకరంగానున్నది!" యనెను.

కాంతిమతి "బాగుంది!—వెన్నెలకు, ఎండకు భేదము సయితము మీకు తెలియడము లేనట్లున్నది" అన్నది ఎకసెక్కెముగా.

ఇట్లు ఎకసెక్కెముల నాడుకొనుచు గమ్యస్థానము చేరుకొను సరికి కాంతిమతి చెల్లెలు భానుమతికి వివాహము జరుగుచుండెను. చిలుకాగోరంకలు లాగ వచ్చిన కుమార్తెను అల్లుడిని చూచి భాపిరెడ్డి దంపతులు మురిసిపోయిరి. పెండ్లికి వచ్చినవారందరు పరశురామరెడ్డి, కాంతిమతి అనుకూలదంపతులయిన విధమును తెలిసికొని ఆశ్చర్యచకితులై సంతోషమును వెలిబుచ్చిరి. ధనధాన్యసంపదలతో బాటు ఆదర్శప్రాయమైన కాంతిమతి పరశురామరెడ్డి దాంపత్యము ప్రశంసనీయముగా నొప్పెను.

(షేక్స్పియర్ నాటక కథ 'టేమింగ్ దిష్రూ' ఆధారం.)



Grihalakshmi - September - 59

# సదాచార సూత్రములు

శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి



(గతసంచిక తరువాయి)

23. సత్య, స్పష్టవచన ప్రవచనంవల్ల మానవునికి స్వాధీనతా జ్ఞానం కలుగుతుంది.
24. తన మానసికాభిప్రాయాలకు దాసుడైనవాడు ఉన్నతోదారుడెన్నడూ కాజాలడు.
25. స్వల్పకార్యమైనా బాగుగా ఆలోచించిన మీదటనే చెయ్యాలి.
26. తమసిద్ధాంతాలనుండి శ్రేష్ఠులైన పురుషులను యమ ధర్మరాజుకూడా మరల్చలేడు.
27. నిజప్రతిజ్ఞారీతులను సదాసంరక్షించ ప్రయత్నించాలి.
28. ధర్మానికి పరమేశ్వరునికి భయపడాలేకాని, దుష్ట, పాపాత్ములకు ఎన్నడూ భయపడరాదు.

# రాజకుమార్

ఫ్రెంచి మూలం :
అంటోని డెసయంట్-ఎక్స్‌పూపేరే

ఆంధ్రానుసరణ :
డాక్టర్ వి. ఎస్. శర్మ



## కథాపరిచయం

[రాజకుమార్ భూమండలానికి సంబంధించిన వాడు కాదు. వాడు పుట్టి పెరిగింది ఒక చిన్న గ్రహమండలంలో. అబ్బాయికున్న ఆస్తిపాస్తులు, మూడు అగ్నిపర్వతాలు — అవి వాడి మోకాలం వరకు వస్తాయి. ఒక రోజా మొక్క. బుర్రలో ఏం తట్టిందో ఒకరోజు వుదయాన భూమండలంలో, ఎడారిప్రదేశంలో ప్రత్యక్షమయ్యాడు. అబ్బాయికి ఆ సమయంలో కావాలసింది స్నేహితులు. వాళ్లతో కొంతసేపు కాలక్షేపం చేస్తూ మానవలోకపు సంగతులని తెలుసుకోవాలని రాజకుమార్ వుబలాటం. ఎంతో కాలం ఎన్నెన్నో పరిసరాలని చూశాడు. అక్కడవుండే వాళ్ళని కలుసుకున్నాడు. వాళ్లు వాళ్ళ లోకాన్ని గురించి చెప్పే విశేషాలని విన్నాడు. ఇలా తొరట్లాడుతూ వున్న సమయంలో చెడిపోయిన వాయు విమానాన్ని మరమ్మత్తు చేసుకుంటూన్న ఒక పైలట్ అబ్బాయికి కనిపించాడు. ఆ పైలట్ వాడికి బాగా నచ్చాడు. అంతవరకు తను భూలోక పరిసరాలలో చూచినవాటిని ఆయనకు చెప్పటానికి మొదలెట్టాడు. ఇక చదవండి.]

### 1

రాజకుమార్ ఆ నిర్మానుష్యమైన పరిసరాలలో కొంతసేపు నడిచాడు. నర సంచారం కనబడటం లేదు. కొంతదూరం వచ్చాక అబ్బాయికి ఒక కొండ కనబడ్డది. వాడికి ఇంతవరకు బాగా తెలిసింది మూడు అగ్నిపర్వతాలు. అవి వాడి మోకాలువరకు వచ్చేవి. చల్లారిపోయిన పర్వతాన్ని కూర్చోటానికి పీటగా వుపయోగిస్తూ వుండటం అబ్బాయికి అలవాటు అయిపోయింది. ఆ పర్వతాలు ఒక ఎత్తు. ఇప్పుడు వాడు చూస్తున్న కొండ ఒక ఎత్తు. అంత పెద్దకొండని వాడింతవరకు ఎక్కడా చూడలేదు. అంత పెద్ద కొండమీద నుంచి ఇటు గ్రహమండలాలన్నిటినీ అటు మనుష్యులందరిని చూడవచ్చని అబ్బాయి అనుకున్నాడు కొంతశిఖరం కేసి గబగబ నడుస్తూ... అంత ఎత్తుకేసి వెడుతున్నా అబ్బాయికి కనబడుతూ వున్నవి ముండ్లపొదలు, పదునైన రాళ్లు. పైకి నడవలేక విశ్రాంతి తీసుకోటానికి మార్గంలో ఒక నిమిషం ఆగాడు. నలు ప్రక్కలా కలయచూస్తూ ''గుడ్ డే'' (సుదినం మీకంతా) అని అన్నాడు.

''గుడ్ డే...... గుడ్ డే ... గుడ్ డే'' అని జవాబిచ్చింది ప్రతి ధ్వని.

''నువ్వు ఎవ్వరివి ? '' అని మన రాజకుమార్ ఆతృతతో అడిగాడు.

''నువ్వు ఎవరివి? ...నువ్వు ఎవ్వరివి ? ... నువ్వు ఎవరివి ? ''అని బదులు చెప్పింది ప్రతిధ్వని.

''నువ్వు నాకు స్నేహితుడివిగా వుంటావా ? నేను ఒంటరిగాడ్ని !'' అని అన్నాడు అబ్బాయి విచారంతో ''నేను ఒంటరిగాడ్ని ... ఒంటరి ... ఒంటరి...'' అని జవాబు వచ్చింది ప్రతి ధ్వనినుంచి.

ఇదేదో వింతలోకమై వుండాలి అని అనుకున్నాడు ఈ వింతవింత జవాబులని

వింటూ. అబ్బాయి అలసిపోయివున్నాడు. ఒక వైపు దోవలో గుచ్చుకున్న ముండ్ల బాధ. ఇంకోవైపు దప్పిక .... మనుషులకి కల్పనాశక్తి వున్నట్లు కనబడటంలేదే! అలాటి శక్తివుంటే తను అన్నమాటలనే చిలుకలకి మళ్లె వల్లించేస్థితిలో వుంటారా? ...నా ఇంటి దగ్గర పువ్వువుంది. నన్ను చూడటంతోనే ఎన్నెన్నో కబుర్లని చెబుతూ సంతోష పెడుతూవుంటుంది ..

◆ ◆ ◆

II

అక్కడినుంచి క్రిందికి దిగివచ్చి అబ్బాయి ముందుకు నడుస్తూవున్నాడు. కొంతదూరం నడిచాక దారికనబడ్డది. దాంతో ఒకనిట్టూర్పువిడిచాడు. రస్తాలు కనబడటం అంటే ఆ పరిసరాలలో మనుష్యసంచారం వుంటున్నదన్నమాట! వేయబడ్డరోడ్లన్నీ ఏవూరికో ఒక వూరికి చివరికిదోవని చూపుతాయికదూ ...

ఆలా ఆ దారిలో నడుస్తూ ప్రక్కన రోజా తోట వుండటం అబ్బాయి గుర్తించాడు. పూలకేసి ఆనందంతో చూస్తూ "గుడ్ డే"అని అన్నాడు. ఆ రోజా పూలు "గుడ్ డే" అని అన్నాయి. అక్కడిపూలు వాడి రోజా పువ్వుకిమల్లెవున్నాయి.

"మీా రెవరు?" అని విస్తుపోతూ అబ్బాయి వాటిని ప్రశ్నించాడు.

"రోజా పూలం" అని అవి జవాబిచ్చాయి.

"అలాగా!" అని అబ్బాయి అన్నాడు వాటికేసి ఎంతో విచారంతో చూస్తూ. ఇంటి దగ్గరనున్న తన రోజా పువ్వు అంటూ వుండేది తనతో సరిసమానమైన పువ్వు ప్రపంచంలో ఎక్కడా లేదని! ఇప్పుడో? ఒకటా! రెండా! వందల కొలది పూలువున్నాయి ఈ తోటలోకి అన్నీ చూడటానికి ఒకే విధంగా కనబడుతూ వున్నాయి!

తన రోజా పువ్వుకే ఈ సంగతి తెలుస్తే ఎంత రాద్ధాంతం చేస్తుందో? అది తనపువ్వు మొలకని పెంచి పెద్ద చేశాడు అలాటిపువ్వు ప్రపంచంలో ఎక్కడా లేదని! ఆమాటని తను నమ్మాడు. తన రోజాకే లోకంలో ఒకవిధమైన ప్రత్యేకత వుందని సంతోష పడ్డాడు. కాని ఇప్పుడు ఈ పూలని చూస్తుంటే తన పువ్వుకి వీటికీ ఎలాటి తేడాకనుపించటంలేదే! తన నిప్పుకొండలు రెండూ, ఆరిపోయిన నిప్పుకొండా, తన మోకాలు వరకు వచ్చినా, అవే పెద్ద కొండలని అనుకున్నాడు. ఇక్కడి పెద్ద కొండని చూశాక ఆ భ్రాంతి మాయమైపోయింది. ఇదంతా లోకపు తీరుకాబోలు! అలాటప్పుడు తన ఆస్తిపాస్తుల్లో వున్న ప్రత్యేకత ఏమిటి?......

ఈ సంగతులని తలచుకుంటూవుంటే అబ్బాయికి దుఃఖంముంచుకుని వచ్చింది. దాంతో దోవలోకనబడ్డ పచ్చికబయలులో పడుకుని ఒక్కపెద్దపెట్టున ఏడవసాగాడు.

◆ ◆ ◆

III

అబ్బాయి అలా వెక్కివెక్కి ఏడుస్తూ వున్న సమయంలోనే నక్క ఒకటి "గుడ్ డే" అని అంటూ దూరాన్నుంచి అబ్బాయిని ఆప్యాయంగా పలకరించింది.

ఎవరు తనని ఇంత ఆప్యాయంగా పలకరిస్తున్నారని ఆశ్చర్యపడుతూ, పచ్చిక

బయలులో పడుకున్న రాజకుమార్ ఛటుకున్న లేచి నలు ప్రక్కలా చూశాడు "గుడ్ డే" అని అంటూ. కాని ఎవళ్లూ కనబడి తేగా!

"ఇక్కడే వున్నాను... ఈ ఆపిల్ చెట్టు క్రింద ... "అని ఒక కంఠం అంటూన్నది దూరాన్నుంచి.

"నువ్వెవరవు? చూడటానికి బాగా వుంటావనే ..." అని ఆ చెట్టు వైపు కేసి ఆతృతతో చూస్తూ అన్నాడు.

"నేనొక నక్కని" అని నక్క అన్నది.

"నా దగ్గరికి వచ్చి కొంచెం సేపు ఆడుకోవూ! ... చాలా విచారంగా వున్నాను" ... అని రాజకుమార్ జాలిగా నక్కతో అన్నాడు.

"నీతో ఆడుకోటం నా చేతగాదే- మచ్చిక పడ్డ జంతువుని కానే!" అని విచారంతో జవాబిచ్చింది నక్క.

"అలాగా!" అని అంటూ కంటతడి పెట్టాడు. తరువాత బుర్రలో ఏం ఆలోచన తట్టిందో అటు కేసి గబుక్కున చూస్తూ

"మచ్చిక పడటమంటే ఏమిటి?" అని అడిగాడు.

"అంటే నువ్వు ఈ ప్రాంతాలకి సంబంధించిన కుర్రవాడివిగా కనబడటం లేదు... ఇంతకూ ఎందుకు వచ్చావు ఇలాటి చోట్లకి?" అని అడిగింది.

"మనుషులని చూడాలని ఇలా వచ్చాను....అదంతా సరేగాని, మచ్చిక పడటం అంటే ఏమిటో చెప్పావు కాదే?"

"మనుషులకి కత్తులు, కఠారులూ వుంటాయి. వాటితో కాలుస్తారు. అదెంతో ప్రమాదమైన పనికూడా! ... వాళ్లకి కోళ్ళని పెంచటమంటే ఎక్కువ సరదా; కోళ్లని చూడటానికి ఇక్కడికి వచ్చావనుకుంటా" అని అన్నది నక్క.

"కోళ్లని చూడటానికీ రాలేదు. గోళ్లని చూడటానికి రాలేదు. నేను వెదుకుతూ వుంది స్నేహితులకోసం.... కాని ఇంతకూ మచ్చిక పడటం అంటే ఏమిటో చెప్పావు కాదే?"

"అంటే ఒక జీవాన్నీ కట్టుదిట్టాల్లో వుంచటం! అంటే ఒక జంతువు తన సహజశక్తిని మరచిపోయి మనుషులకి చాకిరిచేస్తూ వుండటానికి అలవాటుపడి పోవటం అన్న మాట" అని అన్నది నక్క.

"చాకిరి చేయటమంటే?"

'కుర్రవాళ్లని ఎంతోమందిని చూశాను గాని నీకు మల్లె ఇలా అడ్డు దిడ్డు ప్రశ్నలని వేసేవాళ్ల నెవళ్లనీ ఇంతవరకూ చూడలేదు ... నీ దృష్టిలో నేనొక నక్కని. నాలాటి నక్కలు వేనకువేలువున్నాయి. వాటిలో నేనొకదాన్ని కానీ నన్ను పట్టుకుని మచ్చిక చేసుకున్నావా, నిన్ను వదిలి పెట్టి ఎక్కడికీ వెళ్లలేను. ఈ లోకంలో నువ్వే నా యజమానివి అవుతావు. నీకూ నేను సొంతం అయిపోతాను ... "అని నక్క అన్నది.

(మిగతా వచ్చే సంచికలో)

# శ్రావణ మంగళవారం

శ్రీ అయ్యగారి విశ్వేశ్వర రావు

ఆతలకాయ నొప్పి అనాసిన్ బిళ్ళల్ని ఓడించింది. ఇంక ఆఫీసులో కూర్చోవడమే కష్టంగావుంది. ఒక గంట పెర్మిషన్ తీసుకొని బయటపడ్డాను. దేవుడి దయవల్ల శ్రమలేకుండనే ఖాళీ రిక్షా కళ్ళబడింది. ఎలాకూర్చున్నానో తెలియదు, కాస్త దూరం పోనిచ్చి - రిక్షావాడు అన్నాడు - ఎక్కడికిపోదాం బాబూ అంటూ, పోనివ్వరా - ఆర్యాపురం - సత్యనారాయణస్వామి కోవెల దగ్గఱికి అన్నాను. దారిలో ఒక జింజరుషోడా. తాగేసరికి _ దడదడా నాలుగు త్రేనుపులు వచ్చాయి. హమ్మయ్యా అనుకున్నాను, జేబులు వెతికాను. మనీపర్సులేదు, ఆఫీసులో మరిచిపోయానా _ అని ఆలోచించా, మళ్ళీ ఆఫీసుకుపోయి వెతికితే - వొంటిగంట పెర్మిషన్‌కి విలువ పలాయనం అవుతుందని నాభయం, ఇలా ఆలోచిస్తూండగానే ఆషోడాషాపువాడు మర్యాదగా _ రేపు యిద్దురుగాని అన్నాడు. ఈ తొందర యిలాగట్టెక్కడం మనస్సుకి కొంచం చలాకీ లభించింది. తలనొప్పి మాత్రం యింకా వున్నట్టుగానే వుంది.

ఆపు - యిదే మాయిల్లు అని అంటూండగానే ఆరిక్షావాడు మాయింటి ముందర ఆపుచేశాడు. వెళ్ళి యింట్లో పడక కుర్చీలో యిష్టంవచ్చినంత సేపు రెస్టు తీసుకోవాలని తహతహలాడుతూ మెట్లెక్కి తలుపు తట్టుతున్నాను. తలుపులు బద్దలవుతున్నాయికాని లోపలనుంచి బదులు రావటంలేదు. రిక్షావాడు నెత్తిమీదవున్న పిట్టల దొరటోపీని సర్దుకుని _ చింకి బూటుల్ని బాగా బిగించి_ సంచీ లోంచి పొగాకు ముక్కతీసి పంటికిందపెట్టి దానినినములుతూ_చెమట తుడుచుకుంటూ _ నన్ను పంపండి బాబయ్యా అన్నాడు. ఎర్రని నయాపైసా నాజేబులో లేదని ఆ షోడాషాపుదగ్గర కళ్ళారా చూసిన ఆసామీ _ తలుపు అంత తొందరగా ఎందుకు కొడుతున్నానో తెలుసుకో నక్కర్లేదూ, అరే _ పిచ్చి నీకోసమేరా _ యీ తలుపులు బద్దలుకొడుతూన్నది. ఇంట్లోంచి డబ్బులు తేవాలి నీకు యివ్వాలి _ యింతట్లోనే యింత తొందరపడతా వెందుకంట - అని రిక్షావాడి మీద సింహగర్జనచేశాను. ఒకవైపు తలనొప్పి - రెండోది రిక్షావాడి తొందర, మూడోది తలుపు బద్దలుకొట్టినా లోపలనుంచి మాటలేదు మంతీలేదు, చెడ్డ చికాకుగానేనుంటే _ యీ రిక్షావాడు ఒయ్యారంగా నావైపుచూసి — 'ముందుచూపుమాడు బాబూ' అంటూ పకపక నవ్వుతున్నాడు. నాబాధ వాడికి అంత నవ్వులాటుగావుందా? అని అనుకుంటూ అప్రయత్నంగా పైకి చూశాను - గొళ్ళెంవైపు. పెద్ద అలీఘరు తాళం బిడాయించివుంది. ఈ సందు చూచుకొని రిక్షావాడు యింకా నవ్వుతున్నాడు, ఒకరి పొరపాటు యింకొకరికి సంతోషంలాటు!

ఒక గంట పెర్మిషను తెప్పించిన తలనొప్పి - జింజరుషోడాను అరువుపెట్టించి నంతవఱకు బాగానే వుంది. యీ తాళం ఏవిటి! ఆరిక్షావాడి డబ్బుల అరుపేమిటి! ఈ సందడిలో తలనొప్పి మరీతీవ్రమయింది. చేతిరుమాలు తీసి తలకుచుట్టి ప్రక్కవాటా వాళ్ళతో చెప్పిందేమో _ తాళంచెవి యిచ్చిందేమోనని _ యింటి ప్రక్కవాటలన్నీ వెతికాను. ఆవాటా సింహద్వారాలన్నీ యిదేనమూనాలో బంద్. ఈ రిక్షావాడికి చేబదులుచేసి యివ్వడానికికూడా అవకాశంలేదు. ఇంతమంది ఆడాళ్లూ ఎక్కడికిపోయినట్టు. భార్యలసమాజం _ భార్యహక్కులు - _ భార్యల సమ్మె _ అంటూ యేగొడవయినా సాగిస్తున్నారా - అనుకున్నా. రిక్షావాడు తొందరపడి _ యింతసేపు యిక్కడ నిలిపేస్తే రిక్షా అద్దె యెలా చెల్లించేదిబాబూ _ పెళ్లాం బిడ్డల గంజి మాటేవిటి బాబూ! అని వాడి బాధ వెళ్లగక్కుకుంటున్నాడు రిక్షావాడు. అదీ నిజమేమరి, ఆ తలనొప్పితోనే - నాజేబులోనే పర్సులేదని — ఆఫీసులోనే, మరచిపోయినావనీ - నీవుచూస్తూండగానే కాదా షోడా అరువుగాతాగాను అనీ _ మావాళ్ళు యిలాబీగం బిగించి పోవడంవల్ల ఆర్థికభంగం వచ్చిందనీ మెల్లగాబోధించి _ నీరిక్షాఛార్జీకూడా అరువుగా వుంచు, రేపుఉదయం ఏడుగంటలకివస్తే ఇచ్చుకుంటా

యిస్తాను - ఇదుగో యింటి నెంబరు _ నాపేరు _ రావుగారు. ఏంభయంలేదు నీడబ్బులికి అని నేను చెప్పినా _ వాడు యిదోటోపీవ్యవహారం కింద జమ కట్టుకొని. గవర్నమెంటు ఆఫీసుల్లో సీనియరు అప్పరు డివిజను గుమాస్తానని కూడా ఆలోచించక _ నావేషం చూసైనా గౌరవించక - డబ్బులు జేబులో లేకుండా రిక్షా ఎలా ఎక్కినావబ్బా! అంటూ ఒక రామబాణం నామీదవిసిరి - గంటకొట్టుకొంటూ రిక్షావాడు రుసరుసలాడుతూ నావైపుచూస్తూపోయాడు. ఎవర్ని ఏమనగలను. వాడు చెప్పిందీ నిజమేమరి.

లేచిన వేళావిశేషం యిలాంటిది! సుఖపడదామని తొందరగావచ్చినా ఆ యోగం మనకిలేదు. ఎక్కడికి పోయారో యింతమంది ఆడవాళ్ళూను. ఎప్పటికి వస్తారో, ఈ తలనొప్పి తగ్గలేదు. చిన్న కునుకు తీస్తేగాని తలనొప్పి తగ్గదు. అనుకుంటూనే అలాఒరిగాను కటికి నాపరాయి నేలమీద. నిద్ర సుఖం యెరగదుగా! కాస్సేపు కొడికునుకు తీశాను. ఇట్టేమేలుకువ వచ్చింది. చూస్తే చీకటిపడుతూంది. మునిసిపలు ఎలక్ట్రిక్ దీపాలు వెలుగుతూన్నాయి. మా ఆవిడ జాడలేదు, జవాబులేదు_కోపంవచ్చింది. ఎక్కడికైనాపోవచ్చు. మగాళ్ళు యింటికివచ్చి యేమవుతారు? అనే యింగిత జ్ఞానంలేకుండా వుంటే ఎలాగ! అంతట్లో నే గేటు చప్పుడయింది. హమ్మయ్యా అనుకున్నా. ఎక్కడికి వెళ్ళేవ్ యిప్పటిదాకా - యిప్పుడు యిల్లుకావలసి వచ్చిందేం_అన్నాను గట్టిగా, నేనండి అన్నగారూ! అంది మాప్రక్కవాటా అనసూయమ్మ. అరెరే _ కోపంలో నోరుజారిందే. ఏమనుకుంటుందో ఆ అమ్మాయి, ఎవళ్ళతోనైనా చెబితే_ఎంతయాగం! అందుకనే "తనకోపమె - తన శత్రువు" అన్నారు పెద్దలు అనుకుంటూ మళ్ళీ నిరుత్సాహంగా - లేని నిద్ర తెచ్చుకున్నాను. ప్రక్కవాటాలలోవున్న వాళ్ళంతా వస్తున్నారు కాని మా శ్రీమతి జాడలేదు.

ఇంక విసుగెత్తి వీధిగేటు దగ్గరనిలబడి చూస్తున్నాను. అదిగో _అవచ్చే మహిళామణి మా ఆవిడే అయివుండాలను కొన్నా. ఎంత అవస్థపడుతూ వస్తూందో! మా చంటికుర్రాడు _ ఏడాదివాడు _ మధు అదుగో చంకలోవున్నాడు. ఇంకో చంకలో ఏవిటో పెద్దమూట వుందేవిటి! మా పెద్దాడు రాంబాబు వుంటాయి రెండి ఆరేళ్లు_ వాళ్ళమ్మముందర కాళ్ళూచేతులూ ఆడిస్తూ - గిరగిర తిరుగుతూ _ నాకుపెట్టవే అమ్మా _ నాకు పెట్టవే అమ్మా అంటూ ఆవిడనడకకు అడ్డువస్తున్నాడు _ గరగనెత్తి మీదవున్న గణాచారిలాగ. మా రెండోవాడు సుధీర్ కుడిచేయిపట్టుకున్నాడు. వాడూ మధ్యమధ్య పెద్ద మనిషిలావున్నా ఏదో ఏడుపువాడి మొహం లోనూ కనిపిస్తూంది. అమ్మాయి మంజుల - ఎడంవైపున ఏడుస్తూ - ఎత్తుకోవే అమ్మా అంటూంది. అందర్నీ ఎలాగ ఎత్తుకోగేది! అంటూ ఆవిడ ఒక్క ఉరుము ఉరిమేసరికి ఆ ఆడగుడ్డు హడలిపోయింది. ఆవిడ వెనకాతనే యింకా అలసిపోయిన అవతారాలువున్నాయి. కాని మరీయింటి దగ్గరకువచ్చేసరికి పాపం _ మా ఆవిడ ఒక్కర్తే,చూసి తెల్లబోయాను. బొట్టుమీద బొట్టు _ ఆ బొట్టుమీద మరోబొట్టు - యిలాగ బొట్టులదొంతర ముఖంమీద రూపాయి బిళ్ల కైవారంలో ఆవరించివుంది. మెడనిండా అంగుళంన్నర దళసరిని గంధంపూత, కాళ్ళనిండా పసుపుపూత ఎంత కడిగినా పసుపుపచ్చగ వుండే ఘాట్టు కలరుపూత. ఆ పసుపూత. కోకకు కూడా వ్యాపించింది. ఈ పిల్లలతో యిలా వేగుతూ - యీ అవతారంతో - ఒగర్చుకుంటూ మా శ్రీమతి గేటు గుమ్మం దగ్గర నిలబడిచూస్తూన్న నా వైపు చూసింది - చూసి వూరుకుందా - ఏంమగాళ్ళండీ! అలా కొయ్య బొమ్మలాగ కులుకుతూ చూస్తారేకాని _ కొంచం యీ మూట అందుకోరాదూ! అంది. అసలు - యీ అవతారం మా ఆవిడ అవునో కాదో అని చూస్తున్నానే అన్నాను. చూడండి _ నేనేమీ మారిపోలేదు - మీలాగ - అంది ఏమిటోమరి! అయితే యేవిటీవేషం _ ఏవిటి యీ యాత్ర _ ఎక్కడికి పోయావ్? అని అడిగాను మా శ్రీమతిని. ఆవిడ ఆయాసపడుతూ _ హమ్మయ్యా అనుకుంటూ తాళం చెవులగుత్తి నాచేతిలోపెట్టి తలుపు తీయమంది. తలుపుతీసి లైటు వెలిగించాను. ఈ పిల్లలతోటి ఎక్కడికి వెళ్ళకూడదండీ! అంది. అదేవిటే - పిచ్చిదానా, ఎవరి పిల్లలు వాళ్ళకి బరువా! నీ పిల్లల్ని నువ్వే యీగీచేసుకుంటావా! తప్పు! తప్పు! అన్నాను.

మీకేంతెలుస్తుంది, మధ్యదోవలో మంచినీళ్లంటాడు యీ పెదవాడు రాంబాబు. ఈ చంటికుర్రాడు ఒకటే ఏడుపు. ఈ మంజుల_ నేను నడవలేను, నన్ను ఎత్తుకుంటావా? ఎత్తుకోవా? అంటుంది. ఇంక యీ సుధీర్ కనిపించినదల్లా కొనిపెట్టమంటాడు. ఎలాగ వీళ్లతో వేగేది అని చాలా అసంతృప్తి పడింది _ ఆవిడ.

ఈ హడావిడి అంతా యివాళ సాగించావే! ఏమిటి విశేషం? అన్నాను. బావుంది. యింత అమాయకులు కాబట్టే అందరూ మీకు తిరుపతి చేశారు - అంది ఆవిడ నవ్వుతూ.

నవ్వుతూ — యింత ఘాటుమాటల్ని వదిలింది చూడండి. తిరుపతిచేశారట. ఇక్కడ నామ వాచకాన్ని క్రియగా వాడింది. ఏమనుకోవాలి! పైగా నేను అమాయకుణ్ణట! ఇందులోవుండే కవిహృదయం అయోమయంగా అగుపించింది.

అలా అన్నానని బాధపడుతున్నారా! అని ఆవిడ దగ్గరగా వచ్చింది. కొన్ని క్షణాలక్రితమే రిక్షావాడు కూడా చిన్నసలహాయిచ్చిపోయాడు - 'ముందు చూపుమాదు బాబూ' అని. ఆఖరికి అనుకున్నాను. మన బుర్ర యివాళ పనిచేయకుండా సలహాలనే స్వీకరిస్తోందని.

ఇందులో బాధపడడానికేముందిలే! అన్నాను మేకపోతు గాంభీర్యంతో. ఇంతట్లో నేవంటింట్లోకిపోయి పొయ్యిఅంటించి - చకచకా ఏదో పనిచేసినవ్వుతూ నాదగ్గరకువచ్చి — ఇవాళ శ్రావణ మంగళవారం కదా! అంది!! అదా యింత సందడీ అనుకున్నా.

పూర్వం కొన్నాళ్లు శ్రావణమంగళవారం శలవు దినంగా చెలామణీ అయిందంట ఒక ఆఫీసులో. ఆ ఆఫీసరు తురకవాడు. హిందువుల పండుగలు ఆయనకు తెలిసేవి కావు. ఆఫీసువాళ్ళంతా ఆయన దగ్గరకు పోయి - శ్రావణమంగళవారం వచ్చిందిసార్, రేపే, లోకలు హాలిడే యివ్వించాలి అన్నారుట. ఆయన కొత్తగా చేరేడేమో — ఆవుద్యోగంలో యీ హాలిడేస్‌లోవుండే గొడవ ఆయనకు బోధపడలేదింకా, వెంటనే ఆయన అందుకున్నాడు - నిరుటి లిస్టు ఆఫ్ హాలిడేస్‌లో వుందేమో చూడండి — అని. ఆ ఉద్యోగులలో ఉపాయస్థుడు - అంతా ఆలోచిస్తూంటే — చటుక్కున 'నిరుటి శ్రావణమంగళవారం సాటర్డే - సండేలలో కలిసిపోయిందిసార్' అన్నాడు. ఒహో! అని ఆతురక ఆఫీసరు శ్రావణమంగళవారం హాలీడే అని డిక్లేరుచేశాడు. కాని రాను రాను అనుభవం ఆర్జించాక యీ శ్రావణమంగళవారం హాలీడే కాదన్నాడు.

కాని శ్రావణపూర్ణిమను అప్పటినుంచీ హాలీడే చేశారంటారు కొందరు. ఏమయినా - ఈ శ్రావణ మంగళవారం యింటా - బయటా ఎంతో సందడిగా వుంటుంది. ఆవేళ అశుభ శకునాలేవుండవు. ఎక్కడ చూసినా పేరంటాలే, ఏ సందులో చూసినా హడావిడిగాపోయే ఆడవాళ్ళే, ఆదృశ్యాలు ఎంతహాయిగా వుంటాయి - అప్పుడే గ్రహన తిరిగివచ్చిందే శ్రావణ మాసం అనుకున్నాను.

ఇదిగో - యిలాచూడండి — యివన్నీ శనగలే. స్వార్జితం అంటూ మా ఆవిడ ఒక పెద్ద శనగలమూట విప్పింది. రెండు మోదలవఱకూ వుంటాయి తమల పాకులు. అరపంపు చెక్కలంటాయి బాగు గానేవుందేం నీ ఆర్జన అన్నాను. తనకు అభివందన లభించిందని - ఎంత తిరిగాను ఏడాదివరకూ మనంశనగలు కొనక్కర్లేదు. ఏమంటారు? అంది. అది తప్పదు ఎస్టిమేటు అని అన్నానా - ఆవిడతో జగడం తప్పదు.

◆ ◆ ◆

ఆవేళ గడపదాటి ఆఫీసుకిపోదామని ఇవతల పడ్డాను శుభశకునం చూసుకోవడం చాలమంచిదని నా నమ్మకం. ఏం చెప్పను — బారులు బారులుగా పేరంటాండ్రు - రంగు రంగుచీరలతో సీతాకోక చిలకల్లాగ చకచకాపోతున్నారు. చేతుల్లో కుంకుమ భరిణెలు. ఆహాఁ ఎంత శుభశకునం అని హాయిగా ఆఫీసుకిపోయాను. దారి పొడుగునా కలకలాడే ముఖాలు కిలకిల్లాడే కులాసాకబుర్లతో ఆ పేరంటాండ్రు ఎక్కేగుమ్మం - దిగేగుమ్మం. ఎందుచేత యింతమంది యిలా బారులుగాపోతున్నారా? అని అలానడుస్తూ నడుస్తూ ఆలోచించాను. ఓహో! అదా సమాచారం! అప్పుడే మఱచిపోయాను. చూశారా! శ్రావణమాసం, మంగళవారం, మంగళప్రదమైన శకునాలు.

(సశేషం)

# సుఖ-దుఃఖములు

హిందీ :- సుమిత్రానందన పంత్

ఆంధ్రానుకృతి :- చదలవాడ శ్రీ సోదరీ కవయిత్రులు

చిర సుఖమ్మును నేను వాంఛింపకుందు
ఎల్లపుడు దుఃఖమును నిచ్ఛగింపకుందు
సుఖము, దుఃఖము నుం జేర్చి, జోడు గూర్చి
దాఁగురిం తాడుకొనుచు ముదముఁ గొందు

అభ్ర మొక్కపు శశిచేత నణఁగియుండు
చంద్రుఁడును మేఘమున నగోచరుఁడ నగును
చీఁకటియు, వెన్నెలయు నొగి చేరుచుంటఁ
జెలఁగు సుఖమయ పరిపూర్ణ జీవనమ్ము

అతి సుఖమ్మెవ్వనికిని బాధాకరమ్ము
అటులె దుఃఖాతిశయము బాధాకరమ్ము
కనుక లోక హితమ్మునకై సతమ్ము
సమముగా సుఖ - దుఃఖము లమరుఁగాక !

మానవాళి జీవన పరిమాణమునకు
సుఖ దినము, దుఃఖ రాత్రియు శోభఁగూర్చు
జగము. సుఖ - దుఃఖముల సమిశ్రమ్ము గాన
అనవరత సుఖ-దుఃఖము లందు నెవఁడు ?

సంధ్యయు, నుషస్సు నిచ్చట సంభవించు
విలపనము, హాస్య మిచట నావిర్భవించు
యోగము, వియోగ మచ్చట నుద్భవించు
మానవత్వము సుఖ - దుఃఖ మయము సుమ్ము

# నిరుపమ

మూలం : "నిరాల"

అనువాదం : "అరుంధతి"

(గతసంచిక తరువాయి)

యామినీ బాబు చెప్పినట్లుగా కుమార్ నిరుపమ యింటికి వెళ్లాడు. ఇంటినిండా బెంగాలీవాళ్లే. అతడు గుమ్మంలో అడుగుపెట్టగానే అందరూ ఆశ్చర్యంగా చూచారు. వాళ్ల ముఖాల్ని బట్టి అప్పటివరకు వాళ్లు తనగురించే చర్చించివుంటారని అనుకున్నాడు. "ఏదో పని యిప్పిస్తానన్నారు?" అని అడిగాడు యెదురుగా వున్న యామినీ బాబును.

"అసలు మీ స్వగ్రామం?" అన్నాడొకాయన

"రామాపురం"

"రామాపురం!" అన్నాడు సురేష్ ఆశ్చర్యంగా. అంతవరకు యెదురుగా గోడదగ్గర నిలబడ్డనిరుపమ అతడికి యెదురుగావచ్చింది.

"అవును; ఏం?" అన్నాడు కుమార్.

"ఏ రామాపురం?" మళ్లీ అడిగాడు సురేష్.

"ఉన్నావ్ జిల్లా"

"అల్లాగా!" అంటూ నవ్వుతూ సురేష్ నిరుపమ వైపుచూచాడు, నిరుపమకూడ చిరునవ్వునవ్వింది.

"రామాపురంలో యెవరి తాలూకు?" సురేష్ కుతూహలంతో సమాధానంకోసం యెదురుచూచాడు.

"మిశ్రావారు"

"అయితే మీరు బ్రాహ్మణులా?" ఆశ్చర్యంగా అన్నాడు ఒకడు.

"అవును" అనగానే అందరూ ఫక్కున నవ్వారు, ఆ నవ్వు నిరుపమకు కొద్దిగా బాధకలిగించింది.

"మీ నాన్నగారి పేరు?" అన్నాడు సురేష్.

"పండిత గిరిజా శంకర మిశ్రా"

"ఎంతవరకు చదువుకున్నారు?"

కుమార్ నవ్వి, "డి. లిట్. లండన్" అన్నాడు. ఆమాట వినేసరికి నిరుపమ అతనికి దగ్గరగావచ్చి, అక్కడ అంతమంది వున్నారన్న సంగతే మరచిపోయి, అతణ్ణి తేరపార చూచింది.

"అయితే మీ పేరు?" అన్నాడొకాయన.

"కృష్ణకుమార్" అని సమాధానమిచ్చి, "క్షమించండి, అవసరంగా కాలాన్ని వృథాచెయ్యడం నాకిష్టంలేదు. పనేదైనా వుంటే యిప్పించండి" అన్నాడు.

ఎదురుగావున్న యామినీబాబు ఆలోచనల్లో మునిగిపోయాడు. కుమార్‌ను, అతణ్ణిచూస్తూన్న నిరుపమను పరీక్షగా చూచాడు. అయినా యీ కుమార్ ఆ యెదురుగా హోటలులోవున్న వ్యక్తి ఒకరేనన్న ఆలోచన అతడికి తట్టలేదు. సాయంకాలం నీలి చూపెట్టినప్పుడు అతడు సరిగా చూడలేదు, జేబులోంచి రూపాయితీసి, "నువ్వెంతోచాల సాహసమైన పనే చేస్తున్నావు. కాని, నీ చేత పని చేయించుకోవడం మాకవమానం. ఈ రూపాయి తీసుకుని వెళ్లండి, మా యీ స్వల్పసహాయాన్ని స్వీకరిస్తావని ఆశిస్తాం" అంటూ రూపాయి యివ్వబోయాడు యామినీ బాబు.

కుమార్ చిరునవ్వి నవ్వి, "మీ సహాయానికి కృతజ్ఞుణ్ణి, ధన్యవాదాలు. క్షమించండి... యిలాంటి సహాయాన్ని కాదు నేనాపేక్షించింది. మీరు చదువుకున్నవారు. కాని ఆ చదివినదానికి ఫలితం కన్పించటంలేదు. అంతా వ్యర్థం. ఆలోచించండి ... క్షమించండి. అందరికీ నా ధన్యవాదాలు" అంటూ కృతజ్ఞతాపూర్వకంగా నిరుపమను చూచి బైటకి వెళ్ళిపోయాడు.

ఆశ్చర్యంలో మునిగిపోయిన యమినీబాబు నిరుపమను చూస్తూ సురేష్‌తో అన్నాడు. "ఇతని తండ్రే మా నాన్నగారి దగ్గర రెండేళ్లు తనఖా పెట్టాడు"

సురేష్ నిరుపమను చూపిస్తూ, "రామాపురం యీమె జమీందారీగ్రామం" అన్నాడు.

## 5

అక్కగారిదెబ్బకు కోపంవచ్చిన నీలికి యామినీబాబు తనను ఆదరించనందుకు కోపంయెక్కువైంది. అయినా, అందుకోసమని వాళ్ళతో పోట్లాడేశక్తి ఆమెకులేదు. కుమార్ మాట్లాడుతున్నంతసేపు ఆమె తలుపుదగ్గర నిలబడి వింటూనేవుంది, వ్యక్తిత్వమంటే యేమిటో తెలియకపోయినా, అతడు మాట్లాడేతీరును చూచి ఆమె ఆశ్చర్యపోయింది.

కుమార్ వెళ్ళిపోయిన తరువాత - అంతచదువు చదువుకున్నా స్వతంత్రంగా పొట్టగడపడంకోసం యీ వృత్తి స్వీకరించడం అందరూ ప్రసంశించారు. అతణ్ణిగురించి వారలా చాలాసేపు తర్కించారు. దేశంలో యీ కులమత జాతి విభేదాలు ప్రజల్లో నరనరాలకీ పట్టుకుపోయాయి. అందువల్ల మానసికంగాను చారిత్రకంగానుకూడ దేశంపతనమౌతుంది. ఒక జాతిని మరొక జాతి సహించదు. ఆదరించడం అసలే లేదు. అందువల్ల అతడొక మహత్తరమైన మార్గం ప్రజలకు చూపెట్టాడు. సనాతన సాంప్రదాయాలు జీర్ణించుకు పోయిన ప్రజలకుయిది కనువిప్పు కాగలదు. కాకపోతే యీనాటి, యువకులందరూ చదువుపేర విదేశాలకు పోయి అక్కడి అలవాట్లు జీర్ణించుకుని, తన ఆచార సాంప్రదాయాలేమరచిపోయి, ఉచ్ఛనీచాలతారతమ్యాన్నే ప్రక్కకునెట్టి, తన సంస్కృతీ సాంప్రదాయాలకే శతృవులుగా పరిణమించి, దేశగౌరవాన్నే మంట గలుపుతున్నారని కొంతమంది వాదన.

"దానికి పరిస్థితుల ప్రాబల్యమే కారణం. మంచిచెడు వివక్షత లేకుండా పొట్టపోసుకుందుకు యేదో మార్గంచూడాలిగా మరి" అన్నాడొకాయన. ప్రక్కగదిలోవున్న నిరుపమ యీ తర్కవితర్కాలన్నీ విని, ముఖంచిట్లించుకుని వెళ్ళిపోయింది.

తలుపు వెనకాలవున్న నీలిహృదయం కుమార్ పై సానుభూతితో నిండింది. ఆలోచించింది. అతడు యెంతమంచివాడు ప్రతి ప్రశ్నకు సందేహంలేకుండా సమాధానం చెప్పాడు. ఆనాడు మధ్యాహ్నం భోజనాలు అయ్యాక అందరు నిద్రపోతున్నారు. ఆ సమయంలో యెదురుగా వున్న హోటలుకుపోయి కుమార్ తో స్నేహంచేసుకోవాలనే బుద్ధిపుట్టింది నీలికి. అటుయిటుచూచి యెవ్వరూ లేరని రూఢిచేసుకుని ఎదురుగావున్న హోటలులోకి పరుగెత్తింది. కాని, గుమ్మంలోనే వున్న మేనేజరును చూచి ఆగిపోయింది. అతడి గంభీరమైన ముఖాన్ని చూస్తుంటే ఆమెకుభయంవేసింది. ఇంతలో ఒకనౌకరు వచ్చి "కుమార్ బాబు వుంటే నేను పనిచెయ్యను. చేస్తే నన్నుకూడా వెలివేస్తారు" అన్నాడు.

అతడి అభిప్రాయమేమిటో నీలికి బోధపడింది. వీళ్ళిద్దరి ముఖాలు చూస్తూ అక్కడే ఒక కుర్చీలో కూర్చుంది. ఇంతలో మరో యిద్దరు పెద్దమనుష్యులు వచ్చి "ఏమండి మానేజరుగారూ - ఏమిటీ మాల కూడు, మాలవ్యవహారమూను. అబ్బెబ్బె ... " అంటూ కోపంగా చూచారు.

"అయితే కుమార్ ను వెళ్ళిపొమ్మనమని చెప్పమంటారా?"

"ఆ విషయం మేము చెప్పలేం. కాని, అతడున్నట్లైతే మాత్రం మేము హోటలు వదలిపెట్టేస్తాం. దేశంలో వేషభాషలు, సంస్కృతీ సభ్యతలు అన్నీ దిగజారిపోతున్నాయి..." అంటూ చికాకుగా వెళ్ళిపోయారు. వెంటనే కుమార్ ను పిల్చుకు రమ్మనమని నౌఖరుతో చెప్పాడు. ప్రక్కనేవుండి అంతా వింటున్న కుమార్ వచ్చి "మీకు యివ్వవలసిన డబ్బు యిచ్చేసి సాయంకాలమే వెళ్ళిపోతున్నాను. ఇక మీరు చెప్పడం నేను వినడం ఇదంతా అనవసరం..." అంటూ రివ్వున తన గదిలోకి వెళ్ళిపోయాడు.

ఏం చెయ్యడమా అని నీలి ఆలోచిస్తోంది. వెనకాలే వెడితే? అతనితో అసలు పరిచయం లేకుండా యెలాగ వెళ్ళేది? అయినా యీ హోటలువాళ్ళు ఒట్టి గాడిదల్లా వున్నారే! మానేజరుకేనా బుద్ధిలేదు ...కుమార్ యెంత మంచివాడు. అతడి సంగతి వీళ్ళకేం తెలుసు? నెమ్మదిగా కుమార్ వెళ్ళిన మార్గాన్నే వెళ్ళింది. పైన వరండాలో తచ్చాడుతూండగా కుమార్ చూచి గదిలోకి రమ్మన్నాడు. నీలి సిగ్గుపడుతూ లోపలికి వెళ్ళింది. ఇంగ్లీషు మాగజైనులోని ఒకబొమ్మ ఆమె చేతికిచ్చి బెంగాలీభాషలో మాట్లాడడం ప్రారంభించాడు. నీలి ఫొటోనుచూస్తూ "మీరు హిందూస్తానీవాళ్ళా?" అంది హిందీలో.

"మరి మీరో?"

"మేము బెంగాలీ వాళ్ళం" అంది బొమ్మవైపు చూస్తూనే.

"అయితే, మీరు యెక్కడ పుట్టింది?"

యెదురుగావున్న యిల్లు చూపిస్తూ, "అక్కడ" అంది.

"ఆ బంగాళాలోనా ?"

"అవును !"

"అయితే నేను కలకత్తాలో పుట్టాను. హిందుస్తానీవాణ్ణి యెలా అవుతాను ?"

"అబద్ధం... అయితే అక్కకూడా కలకత్తాదే" అతడేమీ మాట్లాడలేదు. మళ్లీ వెంటనే అంది. "మీరు రామాపురంలో వుంటారు కదూ! రామాపురం అక్క జమీందారీ గ్రామం..." అంది నవ్వుతూ.

"పెద్ద జమీందారిణా మీ అక్క ?"

"ఇంకా పెద్దపెద్ద ఊళ్లున్నాయి మా అక్కకు" అంది అతడివైపు చూస్తూ.

"మరి మీ అక్క యిక్కడ వుంటోందేం ?"

అతడి ప్రశ్నకు సమాధానం చెప్పకుండానే "మీ ఊరు జమీందారు పేరేమిటి ?" అంది.

"రామలోచన బాబు"

"ఇప్పుడు ఆయన లేరుగా ! ఆయన చచ్చిపోయారు. ఇప్పుడు అక్కే జమీందారు. ఆ జమీందారీ విషయాలన్నీ మా నాన్నగారే చూస్తున్నారు." అంటూ "అక్క యాయన్ను ప్రేమిస్తోంది..." అనుకుంది మనసులోనే.

"అంటే – మీ అక్కను యెవడు పెళ్లిచేసుకుంటాడో వాడు లక్షాధికారి అన్నమాట"

"అక్కకు యామినీబాబుతో పెళ్లి అవుతుంది"

"యామినీబాబు యెవరు ?"

"ఇప్పుడు యూనివర్శిటీలో లెక్చరరు చేస్తున్నారే. ఆయన".

అతడు మాటలుమార్చి, "నీ పేరేమిటి ?" అన్నాడు.

"నీలిమాదేవి"

"మీ అక్క పేరు ?"

"నిరుపమాదేవి"... "ఏమండి – ఆ యెదురుగా గ్రౌండులో గడ్డి రెండు రోజుల్లో రెండు గుర్రాలు తింటే ఒక్క గుర్రం యెన్ని రోజుల్లో తింటుంది – చెప్పండి" అంది.

"నాలుగు రోజులు. ఏం, నన్ను పరీక్షిస్తున్నావా ?" అన్నాడు నవ్వుతూ.

"అబ్బే . అది కాదండి ... ! పనొచ్చింది... అయితే మీరు యివాళే వెళ్లిపోతున్నారా ?"

"నీ కెలా తెలుసు ?"

"ఇందాక మీరు అంటున్నారుగా – హోటలు వాడికి డబ్బిచ్చి వెళ్లిపోతానని ... ఎక్కడికి వెడతారు ?"

"ఇంకా యేమీ తెలీదు... అయినా మీ అక్కకు యింత జమీందారీ వుంది కదా ! యెక్కడైనా కాస్త స్థలం చూపించకూడదూ ?"

ఆ మాటకు నవ్వుకుంటూ అతడిచ్చిన ఫొటోను తీసుకుని యింటికి పరుగెత్తింది. గదిలో అక్క ఒక్కత్తె కూర్చుని చదువుకుంటోంది. నీలి అక్క ప్రక్కన కూర్చుని అంది.

"అక్కా, కుమార్ బాబు బూట్లపాలిష్ చేయటం వల్ల హోటలువాళ్లు వెళ్లిపొమ్మన్నారు. సాయంకాలం యెక్కడికో వెళ్లిపోతాట్ట. బెంగాలీభాష యెంత చక్కగా మాట్లాడుతాడనుకున్నావు...".

చేతిలోని పుస్తకాన్ని అక్కడే పడేసి నిరుపమ ఆలోచించడం మొదలుపెట్టింది.

## 6

సురేష్ తండ్రి యోగేష్ బాబు ముసలివాడయ్యాడు. ఇంటి వ్యవహారాలు చాలవరకు కొడుక్కే వదలి యోగాభ్యసనం చేస్తున్నా కొడుకును ఒక కంటితో కనిపెట్టుతూనే వున్నాడు. కూడబెట్టిన డబ్బంతా యెక్కడ పాడుచేస్తాడో, యే దుర్వ్యసనాలకు గురి అవుతాడోనని చింతగా వుండేది. సురేష్ బాబు పేషభాషల్లో నవీనుడైనా, తండ్రి మాటకు యెదురు చెప్పలేక సనాతనాచారాలే పాటిస్తూ వచ్చాడు.

నిరుపమ యోగేష్ బాబుకు స్వయాన మేనకోడలు. ఆమె తండ్రి స్వస్థలమైన కలకత్తా వదలిపెట్టి ప్రయాగ వచ్చి స్థిరపడ్డాడు. లక్నోలో యోగేష్ బాబు చెల్లెల్ని పెళ్లి చేసుకున్నాడు. చిన్నచిన్న ఉద్యోగంతో మొదలుపెట్టి చిన్న ఎస్టేటు మానేజరయ్యాడు. ఆ పదవిలోనే చాల ఆస్థి సంపాదించి, చనిపోయేనాటికి పెద్ద జమీందారయ్యాడు. లక్నోలో పెద్దపెద్ద యిళ్లు కొన్నాడు. నిరుపమ ఒక్కతె సంతానం. భార్య చనిపోయిన ఆరెన్నెల్లకే ఆయనకూడ జబ్బుపడ్డాడు. కొద్దిదినాలకే నిరుపమను యోగేష్ బాబు చేతుల్లో పెట్టి శాశ్వతంగా కళ్లుమూశాడు. అప్పటికి నిరుపమకు పది హేళ్లు.

నిరుపమకు పెళ్ళి చెయ్యాలని తలిదండ్రులు బ్రతికి వుండగానే అనుకున్నారు. కాని యెందుకో ఆ ప్రయత్నాన్ని అప్పట్లో విరమించారు. ఇంతలో యిద్దరూకూడ స్వర్గస్థులవడం వల్ల ఆ భారం యోగేష్ బాబుపై పడింది. అతడికి సనాతన ఆచారాలు, ధర్మాలు అంటే యిష్టమే. అసలు ఆ వంశం సనాతన సాంప్రదాయాలకు పెట్టింది పేరు. అయినా నిరుపమ వివాహవిషయంలో మాత్రం అతడెందుకో బ్రహ్మ సమాజమతాన్ని స్వీకరించాడు. అసలతడి అభిప్రాయమే వేరు. నిరుపమ తండ్రికి జబ్బుచేసినప్పుడు నలభై వేల రూపాయలు ఖర్చయ్యాయి — యోగేష్ బాబు లెక్కప్రకారం, రామలోచనబాబు చనిపోయిన తర్వాత యోగేష్ బాబు కొడుకు చదువుకోసమని పదిపదిహేను వేల రూపాయలు ఖర్చుపెట్టాడు — మేనకోడలి ఆస్థినుండే. ఆఖరికి ఆమెకు తెలియకుండానే — కొంత బంగారం కూడా అమ్మేశాడు. "మీనాన్న ఒక్క జమీందారీ మాత్రమే మిగిల్చాడు. తక్కిన డబ్బు, బంగారం — అంతా అఖరుచేశాడు" అని అప్పుడప్పుడు అతడు అంటూవుంటే ఆమె నవ్వుకునేది. తలిదండ్రులు పోయినప్పటినుండి ఆమె ఆ యింట్లో వుండటంవల్ల యీ కుట్రలేవీ తెలుసుకోలేకపోయింది. ఒకవేళ యెప్పుడైనా అనుమానించినా — అంతా భ్రమ అనుకుని తనను తానే అపహాస్యం చేసుకునేది. కాని యిప్పుడిప్పుడు యీ మధ్యన కొద్దికొద్దిగా అర్థం చేసుకుంటోంది. గత కొన్నిదినాలుగా ఆయింట్లో వాళ్ళు తనను సరిగ్గా చూడటంలేదని తెల్సుకుంది. యామినీబాబు సంబంధం మాట్లాడినప్పటినుండి అతడి రాకపోకలు యెక్కువైనాయి. ఇక భవిష్యజ్జీవితంలో కూడ తనకు సుఖమనేది వుండదేమో!... ఇటువంటి ఆలోచలనుండి తప్పించుకుందుకు పూజలు పునస్కారాలు, సమాజాలకు వెళ్ళడం - మొదలైనవి మొదలుపెట్టింది.

యామినీబాబు యోగేష్ బాబు మరదలికి అడపడుచు కొడుకు. వాళ్ళూ కాస్త ఉన్నవాళ్ళే. అయితే నిరుపమకున్నంత ఆస్థి ఆ వంశంలో ఇటు అటు యెవ్వరికి లేదు. యామినీబాబు తండ్రి కాన్పూరులో వకీలుగా వుండేవాడు. తాత జడ్జీపని చేశాడు. అందువల్ల యీ సంబంధం చేస్తే చాల బాగుంటుందనుకొని యోగేష్ బాబు కొడుకుతో చెప్పాడు. తర్వాత యీ విషయమై అతను యామినీబాబుతో మాట్లాడడం మొదలుపెట్టాడు. నిరుపమ అపురూప సౌందర్యవతి, పైగా యామినీ బాబు యూరపు వెళ్ళివచ్చాడు. అక్కడి ఆ చెడుఅలవాట్లతో ఆమె అందాన్ని చూసి మోసపోయి, 'ఆస్థి' అనే ఆశతో ఆమెను చేసుకుందుకు తప్పకుండా అంగీకరిస్తాడని యోగేష్ బాబు అనుకున్నాడు. వివాహానికెలాగైనా చాల ఖర్చవుతుంది. తనదగ్గర యింకా డబ్బున్నట్లు ఆమెకు తెలీదు. అందువల్ల ఆ డబ్బును అలాగేవుంచి, పెళ్ళికోసమని అప్పుచేసి, ఆ అప్పును ఆమెపేర వ్రాసినట్లైతే, తర్వాత తన బాధ్యత వుండదు. తనదగ్గర వున్న డబ్బు తనకే వుంటుంది.

ఒకనాడు యోగేష్ బాబు ఒంటరిగా కూర్చున్న సమయంలో యామినీ బాబు వచ్చాడు. "రా నాయనా, రా!" అంటూ ప్రక్కన కూర్చోబెట్టుకున్నాడు. కొద్దిసేపు ఎవ్వరూ మాట్లాడలేదు. ఆ నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ, "నేను కాన్పూరు వెళ్తున్నానండి..." అన్నాడు యామినీబాబు.

"ఎవరినైనా కలుసుకుందుకా?"

"లేదండి"

"అయితే యీ ఎండాకాలంలో యిక్కడే వుండకూడదూ? అక్కడికెందుకు?"

"సరే"

"నిరుపమకూడ అదేఅభిప్రాయంతో వుంది."

"అది కాదండి మరోపనుంది ..."

"అంత రహస్యమా?"

"ఏదో తనఖావ్యవహారాలగురించి..."

"కాన్పూరులోనా?"

"అవును ... అతనఖాపెట్టిన వ్యక్తి రామాపురం గ్రామవాసి. కుమార్ అంటారు."

యోగేష్ బాబుకు అర్థమైంది. "ఏమిటో ఉద్యోగంలేదు. సద్యోగంలేదు. అటువంటివాళ్ళకే కష్టాలన్నీ" అనుకుంటూ బరువుగా శ్వాస విడిచాడు. "కావాలంటే మా శక్తివంచనలేకుండా సహాయం చేస్తాం" అన్నాడు చిరునవ్వుతో.

"అందుకనే వచ్చాను. తండ్రైనా మీరే. సలహాలు చెప్పినా మీరే, మీరుకాకపోతే యికనాకెవరున్నారు?"

(సశేషము)




శ్రీ కేశిరాజు సోమేశ్వరరావు

"మనోహర్" అన్న పిలుపు ఆకాశంలో విహరిస్తోన్న అతని మనస్సుకు చురుక్కున తగిలింది. ఉలిక్కిపడి వెనుతిరిగి చూశాడు. గుమ్మంలో నిలబడి ఉంది కరుణ. రమ్మనమని సైగ చేసింది.

చలిగాలి విసిరివిసిరి కొడుతూంది. శరీరమంతా ముడుచుకుపోతోంది. గగనంలో మెరుపుతీగలు మెరుస్తున్నాయి. నల్లని మబ్బులు జట్లుజట్లుగా నీలాకాశంలో పరుగెడుతున్నాయి. కొద్ది సేపట్లో చినుకులు పడేటట్లుంది, అరిచేతులు గట్టిగా రుద్దుకొని అటూ ఇటూ చూసి తిన్నగా ఇంట్లో ప్రవేశించాడు.

టేబిల్ ముందున్న కుర్చీలో కూర్చుని "గృహలక్ష్మి" తిరగేస్తోంటే కరుణ అతని దగ్గరగా వచ్చి నిలచింది.

"మీ అమ్మగారు ఇంట్లో లేరా" అన్నాడు మనోహరు. "లేదు. డాక్టరుగారింటికి వెళ్లింది." సన్నగా అంది కరుణ. ఆమె ముఖం దుఃఖభారంతో నిండి ఉంది. ఆమె కురులు తైల సంస్కారశూన్యాలై చెదరియున్నాయి. నొసలంతా స్వేదకణాలతో నిండి ఉంది. నీరసంగా "పరిస్థితులు తారుమారవుతున్నాయి. మా అన్నయ్య నాకు సంబంధాలు చూస్తున్నాడు మన వివాహం నీకిష్టంలేదా మనోహర్? మనః పూర్వకంగా చెప్పు నేనంటే నీకు ప్రేమ లేదా!" అంది కళ్ళ నీళ్లు తుడుచుకుంటూ.

మనోహర్ ఆమె మాటలకు విచలితుడయ్యాడు. కాస్సేపు మౌనంగా ఉండి అన్నాడు "కరుణా, నామనస్సెరిగీ నీవితంగా ఆందోళనపడుతున్నావంటే ఆశ్చర్యంగా ఉంది. నామాటనమ్ము - రేపే మదరాసు వెడుతున్నాను. నా తల్లిదండ్రులకు మన వివాహంగురించి నచ్చచెప్పుతాను. మీ అన్నగారితో మాట్లాడమంటాను: మా నాన్న నా మాటత్రోసివెయ్యడు. నీవేమి బాధపడకు." అంటూ ఓదార్చాడు.

కరుణకాతని మాటలతో కాస్త ధైర్యం కలిగింది. "ఏమో మనోహర్ నిన్నే నమ్ముకున్నాను. నీకే నా హృదయమిచ్చాను. నామనస్సులోని ఆందోళన నీతో తప్ప ఎవరితో చెప్పుకోగలను! త్వరగా మీ నాన్నగారి నొప్పించుమనోహర్! మన జీవితాలు ఒక్కటి చెయ్యి." అన్నది తల వంచుకుని.

◆ ◆ ◆

సరిగ్గా సంవత్సరం క్రితం ఒకనాటి మధ్యా

హ్నం కరుణ తన గదిలోకూర్చుని కిటికీ లోంచి వీధిలోకి చూస్తోంది. నాలుగు నెలలుగా తాళం తగిల్చియున్న ఎదురింటిలో ఎవరో మసలుతున్నట్లుగా ఆమె ఆయింటి వైపు చూసింది.

సావిట్లోగోడకు తగిలించిన అద్దంలో ముఖంచూచుకుంటూ తల దువ్వుకుంటు న్నాడు ఓయువకుడు. కరుణ అతనెవరో చూడాలనుకుంది. అరగంటసేపు తల దువ్వి పాంటు షర్టు వేసుకొని ఆడించు కుంటూ గుమ్మంలో నిల్చున్నాడతడు. కరుణా అతని జూడగానే ఎందువలనో రోమాంచిత అయింది. సిగ్గుకలిగింది. అప్రయత్నంగా తలవంచుకుంది. ఇదివరకు ఎందరు యువకుల్ని చూడలేదు తను! కాని యీతనిలో ఏదో ప్రత్యేకత ఉందను కుంది కరుణ. అదిమొదలు కరుణ చాటు మాటుగా అతని సురూపాన్ని చూడనారం భించింది. యీ సంగతి కనిపెట్టి ఆయువకు నెమ్మదిగా చూపులుకలిపాడు. అతడే మనోహర్.

కాలం గడచినకొద్దీ ఇరువురూ పరస్ప రం ఆకర్షితులయ్యారు. మాటాడుకోవ టానికి తహతహపడ్డారు. ఏకాంతంకోసం తపించిపోయారు. అదృష్టంకలసి కరుణ తల్లి చుట్టాలింటికి వెళ్ళడం, అన్నగారికి తాలూకాఫీసు గుమాస్తాగిరిలో తీరికలేక పోవడం వారికి అనుకూలించాయి. ఒకరి కౌగిలికి ఒకరు అంకితమైనారు. ఒకరి చేతులలో నొకరు ప్రమాణాలు చేసు కున్నారు "నీవు లేనిదే నేనుజీవించలేను. అగ్ని సాక్షిగా నిన్ను వివాహమాడ తాను" అన్నాడు మనోహర్ "నిన్నుతప్ప నేనెవరినీ ప్రేమించలేను. నీవే నాజీవితం" అంది కరుణ. వారిప్రేమకు, పరమావధి యైన వివాహంకోసం ఇరువురూ ఎదురు తెన్నులు చూస్తూ ఇంతవరకూ కాలంగడి పారు.

♦ ♦ ♦

మదరాసు వెళ్ళిన మనోహరు కోసం దినాలూ, వారాలూ ఎదురుచూచింది కరుణ. ఆరునెలలు గడిచినా మనోహరు అంతు చిక్కలేదు. "ఎంతకుటిలాత్ముడు! హృదయపూర్వకంగా ప్రేమించానన్నాడే! నమ్మించి మోసం చేసాడు." అని మనస్సు స్థిరపరచుకుంది కరుణ.

చివరకు అన్నగారు నిశ్చయించిన సంబం ధానికే కరుణకు వివాహం జరిగింది. కరుణకి మదరాసులో ఏదోప్రైవేటు కంపెనీలో పని. పెళ్ళయిన తరు వాత నెలరోజులకే కరుణ భర్తతో మదరాసు వెళ్ళిపోయింది. కొత్త కాపురం. కరుణకు అంతా క్రొత్తగా ఉంది. అయినా చెయిదిరిగిన గృహిణిలాగ ఇంటిని దిద్ద డానికి పూనుకుంది. వంట చెయ్యడం ఆమెకు క్రొత్తగాదు. ఆమెచేతిలో కళ ఉంది. ఇల్లంతా మంచిమంచి బొమ్మలతో పటాలతో ఆమె అలంకరించింది.

కరుణ అంటే ఆమె భర్త రాజుకు అమితప్రేమ. అతడుకోరుకున్న స్త్రీ లభిం చింది. విద్యలో, ఇంటి పనులలో, మాత్రమే గాక రూపంలో, సంగీతంలోగూడ కరుణ ఎవరికి తీసిపోదు. అతనిప్రేమకు ఆమె పాత్రు రాలయింది. అట్టి భర్తను సమకూర్చిన దైవానికి ధన్యవాదాలను అర్పించిందామె. తను నమ్మిన భర్తను స్వర్గానందంలో

తేలుస్తూ ఆమె మనోహర్‌ను పూర్తిగా మరచిపోయింది.

ఆదివారం సినిమాకు వెళ్ళడం వారి కలవాటు: కరుణ ముస్తాబయింది. ఇరువురూ "కల్యాణ పరిశు" సినిమాకువెళ్ళారు. హాలులో భర్తప్రక్కన ఎవరోకూర్చొని మాట్లాడుతున్నారు. ఆ కంఠస్వరం ఆమెకు పరిచితమైనదిగాతోచింది. ఎవరా అని చూచింది. "మనోహర్" ఆమె గుండెల్లో గాలివాన బయల్దేరింది. సినిమాచూస్తోందే కాని ఆమెమనస్సు ఇక్కడ లేదు. సినిమా వదిలేసారు. హీరోచూపించిన త్యాగం నిజంగా ప్రపంచంలో ఎవరైనా చూపించగలరా అనుకుంది.

హాలుబయట తనకొరకు ఎదురుచూస్తూ నిలబడిన రాజు వద్దకు వచ్చింది. అతని ప్రక్కనే మనోహర్ నిలబడియున్నాడు. ఆతడు తనను గుర్తిస్తాడేమోనని భయంతో అటువైపు తిరిగి అవగుంఠనం వేసుకుంది. ఇంతలో రాజు మనోహర్‌తో "ఈమే నా భార్య, కరుణాదేవి" అంటూ పరిచయం చేసాడు.

మనోహర్ ఆమెను చూచి గతుక్కుమన్నాడు, "నమస్కారం" అన్నాడేగాని అదినూతిలో గొంతుకులా, ఉంది, ధారాళంగా, రాలేదు. ఆమె ప్రత్యభివాదనం చెయ్యడమే మరచిపోయింది. రాజుకు వీరిద్దరి ప్రవర్తనావింతనిపించింది.

ప్రతిరోజూ కరుణకు ఒక యుగంగా గడుస్తోంది. తనకు మనోహర్‌కు గల పూర్వపు సంబంధం తెలిస్తే తన గతి ఏమవుతుంది? మనోహర్ తన భర్తలేని సమయంలో వచ్చి బలవంతం చేస్తే - బెదిరిస్తే తనగతి ఏమిటి? తనకెవరు దిక్కు కరుణకు యీ వ్యథతో నిద్రాహారాలు కరువయ్యాయి. ఏనాటికైనా తనవిషయం బయట పడటం తథ్యమని, తమ అనురాగమయ దాంపత్యంలో విషబిందువు చిలుకుతుందని ఆమె నిశ్చయించుకుంది.

కరుణ రోజురోజుకు చిక్కిపోవడం, ఎప్పుడూ పరధ్యానంగా ఉండడం రాజుకు ఆశ్చర్యమయింది. ఆఫీసునుండి ఇంటికి వచ్చే సరికి ప్రేమతో ఎదురేగి పలుకరించే కరుణ రానురాను మాటాడడం కూడా తగ్గించడంతో రాజుకు విషయమేమి తెలియక బాధగా ఉండేది. ఏ క్షణంలో భర్త ఏ విషయాన్ని ప్రస్తావిస్తాడో అని ఆమె భయపడసాగింది.

పదిహేను రోజులు గడిచాయి. నీరసంతో ఆమె జబ్బునపడింది. ఒకనాటి మధ్యాహ్నం రాజుతో మనోహర్ కూడా వచ్చేడు. మంచంమీద చిక్కి సగమైపోయి ఉన్న కరుణను చూడగానే అతని హృదయం కలుక్కుమంది. సతతం ప్రసన్నంగా ఉండే ఆమె ముఖపద్మం ముకుళించుకుపోయి ఉంది. ఆమె దీనపుచూపులు అతనికి ఏదో స్ఫురింప జేసాయి.

"పది రోజుల్నించి ఆమె అన్నమే తినడం లేదు. ఎప్పుడూ పరాకుగానే ఉంటుంది. మనసులో ఏముందో చెప్పదు. ఏమీ లేదని తేల్చేస్తుంది మనోహర్" అన్నాడు. విచారంగా రాజు.

"ఏం చెల్లీ! మా వాణ్ణిలా బాధపెడితే ఎలా చెప్పు. నిన్ను పెళ్లాడింది-వాడు బాధపడడానికా! మనసులోని కోరికేమిటో

చెప్పితే తీరుస్తాడుకదా చెల్లీ!" అన్నాడు నవ్వుతూ మనోహర్.

"చెల్లీ" అన్న సంబోధన ఆమెకు కొద్ది మనశ్శాంతి కల్గించింది. "నన్ను క్షమించు భగవంతుడా! ఈ దీనురాల్ని క్షమించు" అని మనస్సులో అనుకుంటూ గట్టిగా కళ్లు మూసుకుంది.

ఇంతలో రాజు కొరకు ఆఫీసునుంచి ప్యూనువచ్చి మేనేజరుగారు అర్జెంటుగా రమ్మంటున్నారని చెప్పాడు. కరుణకు ఈ పూట మందులేదు. ఉదయం మందువేళ తప్పతోంది. రాజుకు ఏమీ పాలుపోలేదు. "మనోహర్! దయయుంచి డాక్టర్ ఎంబెరుగూళ్ గారింటికి వెళ్ళి మందు తెచ్చిపెట్టు : టైంలేదు. నేను ఆఫీసుకు వెళుతున్నాను. కరుణా! జాగ్రత్త" అంటూ వెళ్ళిపోయాడు రాజు.

నెమ్మదిగా మనోహర్ ఆమెను సమీపించాడు. అతని కంఠం రుద్ధమైంది. "చెల్లీ నీ మనోవ్యథ నాకర్థమైంది. నిన్ను ఒకప్పుడు ప్రాణసమానంగా ప్రేమించిన మనోహర్ అంత మూర్ఖుడని, దుర్మార్గుడని అనుకోవద్దు. నీతో మాటాడిన మరుసటిరోజే ఇక్కడికి వచ్చాను. నా తల్లిదండ్రులతో మన వివాహం విషయమై చెప్పాను. వారు సుతరాం అంగీకరించలేదు. ఎంతగానో పోట్లాడేను. కాని ఫలితం దక్కలేదు. నా జీవితంమీద నాకే విసుగు జనించింది. ఇల్లు వదలి విశాలప్రపంచం లోనికి పారిపోయ్యాను. గత ఎనిమిది నెలలుగా తిరిగి తిరిగి మానాన్న మరణించాడని తెలిసి నెలరోజుల క్రితం ఇక్కడికి వచ్చాను. ఇక మన వివాహానికి ఎటువంటి అడ్డంకులులేవని ఎంతో సంతోషంతో మీ వూరు వెళ్ళాను. అప్పటికే నీ వివాహమైపోయిందని, భర్తతో కలిసి వెళ్ళిపోయావని తెలిసింది. విధి బలీయమైపోయింది.

పచ్చని నీ సంసారంలో చిచ్చుపెట్టేటంత సిచుణ్ణికాదు చెల్లీ! ఎన్నటికి కాను. నీవైనా సుఖంగా ఉండటమే నాకు కావలసింది. నీ సుఖంకోసం నేను ప్రాణాలయినా అర్పిస్తాను. నావల్ల నీకెన్నడూ అపకారం జరుగుతుందని కలలోగూడా తలచవద్దు. లే, చెల్లీ. లేచి కూర్చో. పూర్వం నీ పెదవులపై విరిసిన చిరునవ్వు మరొక్కమారు నన్ను చూడనియ్యి" అంటూ చెమర్చిన కళ్లు తుడుచుకున్నాడు మనోహర్.

కరుణ లేచికూర్చుంది. ఆమె కళ్లు ఆనందంతో మిలమిల మెరుస్తున్నాయి. ఆమె హృదయంలో ముసురుకున్న అనుమాన మేఘాలు పటాపంచలయ్యాయి.

"అన్నయ్యా! నీదెంత ఉదాత్త హృదయం. నిన్ననుమానించినందుకు నన్ను క్షమించు" అంటూ కరుణ నవ్వింది.

# "శాంత"

శ్రీమతి పులిపాక బాలాత్రిపురసుందరమ్మ



ప్రదేశము : అరణ్యము

భార్య:—యేమండి! మన అబ్బాయి యింకను రాలేదు. ఈ దినము ఇంత ఆలస్యమగుటకు కారణమేమై యుండును?

భర్త:—మామూలు స్థలమునుండి ఈ దినము క్రొత్త స్థలమునకు తీసుకొని వచ్చెను కదా! ఇచ్చటికి మంచినీటి కోలను ఎంత దూరమున్నదో మనకేమి తెలియును! యిద్దరము అంధులమే. ఈ అంధకారంబున మన మెచ్చట యుంటిమో, మంచినీరు ఎచ్చట యుండెనో మనకేమి తెలియును? ఈ అంధులమైన మనకు, జ్యోతివలె, ఆ ఒక్క పుత్రునైననూ, భగవానుడు ప్రసాదించినాడు కనక, ఆ వెలుగున బ్రతుకుచుంటిమి గాని లేనిచో మన బ్రతుకులే లేవు.

భార్య:-ఆ పుత్రుడైనను సద్గుణసంపన్నుడు, పితృభక్తి పరాయణుడు, సత్యశీలుడు. గనుక, గ్రుడ్డివారమైనను యేకష్టము లేకుండ పోషించుచున్నాడు. లేనిచో మనపాట్లు పరమాత్మ కెఱుక.

భర్త:-అవును. బుద్ధిమంతుడే గాకున్న, యిన్నిరోజులు మనము బ్రతికియుందుమా? ఏ నూయ్యో, గోయ్యో చూచుకోవలసినవారము.

భార్య:-అవును, వాడు ధైర్యశాలిగూడాను. ఆనాడు మన రాజాగారు రాజ్యభ్రష్టులై పోవుచుండ, ప్రజలంతా ఘోడు, ఘోడని ఏడ్చుచు, తలావోక దోవన పోవుచుండగా, పన్నెండు సంవత్సరముల పసిపాపడు మనబిడ్డ ధైర్యముచెప్పి "కందమూల ఫలములు తెచ్చి మిమ్ములను పోషించెద" నని మనలను ఇచ్చటికి తీసుకొని వచ్చినాడు. పోనిండు మనబిడ్డను మనము స్తోత్రము చేయరాదు.

భర్త:-మన రాజ్యములో మాత్రము యింతకంటె ఎక్కువ సుఖమున్నదా? మనము రాజ్యము వీడి వచ్చినదాది యింతవరకు మనలను యెంత సుఖముగా పోషించుచున్నాడు. ఎక్కడ వున్న ఏమి? మన పుత్రునెదుటనుండుట మనకు సుఖము, సంతోషము.

భార్య:—యేమండీ! అబ్బాయి మంచినీటికొరకు వెళ్ళి చాలా ఆలస్యమైనది. కొలను ఎంతదూరమున్న నేమి యింతసేపు ఆలసించువాడు కాడే? యేదైనా ఆపద వాటిల్లలేదు కదా?

భర్త:-ఛీ! నీమాటలన్నియు అమంగళం పలుకుచున్నవి. (రెండుచేతులు పైకెత్తి) హరి! హరి! లోకరక్షకా! మహానుభావ! ఆపద్బాంధవా! అంమంగళము ప్రతిహతమగు గాక, నా పుత్రుడు శీఘ్రమే మంచినీటితో వచ్చుగాక.

సీ॥ విషసర్పమప్పుడు బుసపెట్టిపైకెగుర
ధైర్యంబతోదాని చెండెనపుడె.
వనకన్యలిద్దరు వరుసలు భాషింపసోద
రపలుకులతో త్రోసిపుచ్చె.
చోరులెదురువచ్చి సంచులు శోధింప
బంధు భావంబుతో పారద్రోలె.
క్రూర మృగములు రెండుకూడి
మ్రింగరాగ.
మాయ యుపాయమున మనలగాచె.
గీ॥ తల్లితండ్రిని దైవముగా చూచునతడు.
కలలోనైన కల్లలాడడతడు.
యాటలోనైన మరియాదతప్పడతడు
అట్టిపుత్రునకెట్టి యాపదలురావు.

అదుగో! మనుష్యశబ్దము వినవచ్చుచున్నది మాటలలోనెవచ్చినాడు. అబ్బాయి! నూరేండ్లు వర్ధిల్లు నాయనా! (అని రెండుచేతులు చాచును బ్రాహ్మణుడు.)

దశరథ మహారాజు ఆనపకాయ బుఱ్ఱతో మంచి నీళ్ళు తీసుకొని ప్రవేశించును.

ద:-మౌనముగా కూర్చుండి మంచినీళ్ళ బుఱ్ఱను చేతికి అందించును.

భార్య:-నీళ్ళ బుఱ్ఱఅందుకొని క్రిందపెట్టి దశరథమహారాజుని చేతులతో తడివిచూచి,

నాయనా! కుమారా! మాట్లాడవేమి? నీకు ఈ హారము లెక్కడిది?

ఇంత ఆలస్యమేలచేసితివి? గద్గద కంఠముతో.

నాయనా! నీవేనా? ఎవరన్నా చోరులా అని యిరశల దశరథ మహారాజుని ఒళ్ళంతా తడివి చూచి.

యేమీ మహాప్రభో మీరు రాజావలెయున్నారె?

సీ॥ మహారాజ నీవెవరు? మాసుతుండే
మూరామె?
మర్మమీడిచెప్పు మాన్యచరిత మమ్ము
పోషించుటకు
మరిదిక్కులేరిలను పుత్రజాడ
తెలుపు.
కబోదులము మేము కరుణించి
మమ్ములను
తనయ జాడలు తెల్పు సత్వరంబు.
అడవులు త్రిప్పుటకు, పండ్లుతిని
పించుటకు.
తప్పులు తీర్చుటకు తానొకడె.

గీ॥ గంగలోపడెన, లేక, భరణిరాజు
పాలపడెన?
మారుబల్కవదేమింత మంకుతనమ?
బదులు చెప్పవదేలను బధిరయుంద?
చెప్పకున్న శాపంబు ఇత్తునిపుడే.

అనుచు కోపముతో రాజును అవతలకు త్రోయును.

ద:-మహాతపస్సంపన్నా! విప్రోత్తమా! నేను తప్పు చేసినవాడను. మీయందు అపరాధ మెరింగిచేయ లేదు. యెఱుంగకచేసినను ఆ దుర్మార్గము నాదె క్షమింపుము.

సీ॥ అయోధ్యపురిమాది. నాపేరు
దశరథుడు.
అర్కవంశంబున పుట్టినాను.
వంశమర్యాదగా వేటకును వచ్చితి
వేటమృగమని వేస్తివేగశరము.
బుడ, బుడ, శబ్దంబు, పొంచుండి
వింటిని,
దంతియని వేసితి బాలకుణ్ణి.
హరి హరియనగాను, అటుతిరిగి
చూచితి,
బ్రాహ్మణుని చూచి విభ్రాంతుడైతి.

గీ॥ తప్పునయది వినుడి, ఓ విప్రవర్య
రండునావెంటట గొంపోవుదు నాదుపురికి
నీదుపుత్రుని తుళ్యగా చూతునేను,
శరణు శరణయ్య మీ పాదపద్మ
ములకు.

(బాహ్మణుని చేతులుపట్టుకొని)

బ్రాహ్మణోత్తమా! నేను చేసినపని మిక్కిలి యపరాధము. మీరు వేసిన శిక్షకుపాత్రుడను. అయినను తెలియక చేసితిని గనుక క్షమించ వేడుచున్నాను. మీ సతీపతులిరువురున్నూ నన్ను క్షమించి నాతోడయోధ్యకు రండు. నేను మీ పుత్రుని కంటె ఎక్కువగా పోషించెదను. నా రాజ్యమంతయు మీకే ధారవోసెదను. నేను మీకు పుత్రునివలెను, బంటువలెను, బానిసవలెనుండి మీ పరిచరియలు నేనే స్వయముగా చేసెదను. అవిగో! గజములు, రథములు, తురంగములు, (చేయిపట్టుకొనును.)

బ్రా:-(చేయి విదలించుకొన్ని) ఛీ॥ పుత్రఘాతకా! పుత్రడి బొమ్మవోలె పదునారు సంవత్సరముల నవయవ్వనుని నా పుత్రుని నీ పొట్టబెట్టుకొని, ఇంకను నాకు శ్రీరంగ నీతులు దిద్దుచుంటివా? నీ రాజ్య మెంత యిచ్చినను నా పుత్రుడగునా! నీ బోటి రాజు లెందరి బుద్ధియైనను నా కుమారుని గుణములతో సరితూగునా? నీ రాజ్యము లెన్ని యినను నాకు కలుగుప్రయోజనము శోకదంపిన బియ్యమే. చెవిటి వానికి శంఖధ్వనియు, గ్రుడ్డి

వానికి అద్దబింబమున్నా యెంత ప్రయోజన ములో నీకు తెలియవా? గ్రుడ్డివానికి ఏమి తెలియునని మనశ్శాంతి మాటలు పలుకుచుంటి వా? ఛీ! పొమ్ము (అని తలత్రిప్పును.)

బ్రా:_ఓ! మహారాజ సుహృత్ప్రియంబులు ఎన్ని చెప్పిననూ యీ కడుపుమంట చల్లారదు.

గీ॥ మాతృగరంబు మంటతో నింపోయె
పితృహృదయాన శోకంబు పెనుకు
చుండె
నీదు రాజ్యంబు పని లేదు నిష్ఫలంబు
విడుతుమిప్పుడె ప్రాణముల్ జాగు లేదు.

నేడు కాకున్నను, రేపు అయినను ఈ జీవములు పుత్రుని విడిచి, ఈ బొందినుండునా? యిక ఊర్థ్వ రెణ్ణెడు వుదకమైననూ మ్రింగుదుమా? రాజా నిన్ను తలంచుకొనుచూ పుత్రశోకంబుతో యీ రెండు జీవ ములు పుత్రా! పుత్రా! అని ప్రాణంబులు విడచుట నిక్కంబు రాజా! నీవు మాత్రము ఎన్ని సంవత్సర ములకైననూ, నీవు మావలె పుత్రా! పుత్రా! అని ప్రాణములు విడుతువు. యిది బ్రాహ్మణ శాపంబు తరముకాదు. - ఆ పుట్టించిన - బ్రహ్మకైనను తరముకాదు. ఇది మాత్రము జ్ఞాపముంచు కొనుము. ఇకపొమ్ము, పొమ్ము.

ద:_విప్రోత్తమా! మీ రెన్ని విధములనన్ను దూషించి ననూ, మిమ్ములను విడిచిపోవుటకు నా మనస్సొప్పు కున్నది. స్వయం కృతాపరాధము గనుక శాపంబు అనుభవింతులెండు. తప్పవదేమున్నది? మీరు వచ్చుమాట తలవిండు, రండు, నా వెంట రండు,

భ్రా:-రాజా! మొండి తనము గానీ నీవెంత బ్రతి మాలినను మేము నీతో వచ్చునది కల్ల. ఇదుగో యిప్పుడేగుండె ఆగిపోవుచున్నది. (అని గుండెమీద చేయిపెట్టుకొనెను.)

భ్రా:-(దగ్గరకు జరిగి చేతితో నిమురుతూ) నాథా! ముందుగా నా ప్రాణములు విడువనిండు. తరు వాత ఎటులఅయినను నేను వినను గదా! అయ్యో ఎంత పాపిని (అని భర్తకు దగ్గరగా జరుగును.)

బ్రా:_తొందరపడకుము: కొంచెము శాంతించినది. కాని మిక్కిలి దాహముగుచున్నది. హా! పుత్రా మా దాహములు తీర్చుట నిన్నటతోనే సరిపోయె నదా? తండ్రీ (అని ఎలుగెత్తి ఏడ్చును.)

ద:-(దగ్గరకువచ్చి) యివిగో మంచి నీరు కొంచెము పుచ్చుకొండు. (అని సొరకాయ బుఱ్ఱచేతి కిచ్చును.)

బ్రా:-(విసురుగా బుఱ్ఱచేతికి లాగుకొని) ఇంకా నీ విక్కడే యుంటివా! (అని బుఱ్ఱ విసరి పార వేయ అది పగులును.)

(దశరథుడు చిన్నబోయిన ముఖముతో కాలి నడకతో అయోధ్యకు వెళ్ళును. రథ, గజ, తురం గములన్నియు వెడలిపోవును.)

(తెరపడును.)

## 2-వ రంగము

(కౌసల్య అంతఃపురము.
గదిలో కౌసల్య సోఫాలో కూర్చుంటుంది.
చెలికత్తె మల్లిక ప్రవేశించును.)

కౌ:_యేమే మల్లికా: ఇంత ఆలస్యముచేసితివి? దేవి పూజకు వేళ అతిక్రమించుచున్నది. పువ్వులకు వెళ్ళినదానవు ఇంతజాగా?

మ:-అమ్మా నా తప్పేమియు లేదు. ఈ రోజు పండుగ దినముగుటచే రాజ దర్బారునకు శలవుగదా? రాజు గారు ఉద్యానవనంబునకు విహరించ వెళ్ళినారు. మన మహలు క్రింది అంతస్థులన్నియు నిశబ్దముగా నున్నవి. నౌకరులందరు ఎచ్చటికో వెళ్ళినారు. ఒక బ్రాహ్మణుడు భిక్షమునకు వచ్చినాడు. వెళ్ళమని ఎంత చెప్పినను వెళ్ళక నాతో వాదించు చున్నాడు. నాకు విసుకుపుట్టి మీతో చెప్ప వచ్చితిని.

కౌ:_అయ్యో! మల్లికా బ్రాహ్మణుని వెళ్ళమంటివా! మన రాజుగారు పండుగ దినములలో వచ్చిన వారికి లేదనక బియ్యమో, డబ్బులో యిప్పిం తురుగదా! ఆ సంగతినీ వెరుగవా? నీ విక్కడే యుండుము నేనే స్వయముగా ఆ బ్రాహ్మణునికి భిక్షమిడి వచ్చెదను. నీవు ఆపళ్లెరంబున బియ్యము నింపి తెమ్ము.

మ:-(బియ్యము తెచ్చి).
అమ్మా నేను పళ్ళెము తెత్తునా.

కౌ:-వద్దు నేనే తీసికొని వెళ్ళెద. (కౌసల్య బియ్యము బ్రాహ్మణుని ఎదుటకు తెచ్చి) బ్రాహ్మ

ణోత్తమా యిదిగో భిక్షము. (అని పెట్టబోవును.)

బ్రా:-తల్లిగారు నాకొరకు మీరే కష్టపడితిరా? ఏచిన్న పాపచేతనన్నా పంపకపోతిరా?

కౌ:-(మోము చిన్నబుచ్చుకొని) బ్రాహ్మణోత్తమా! నేనంతనోము నోచుకొనలేదు. ఈ యింటికి పిల్లను, పెద్దను, నేనే (అని నేలవంక చూస్తూ నిలుచుండును.)

బ్రా:-(ఆశ్చర్యముతో) దేవిగారూ! తమకు సంతానము లేదా?

కౌ:-యింకా విపులముగా చెప్పవలెనా? భిక్షము తీసుకొనుడు నేను వెళ్ళెదను.

బ్రా:-అమ్మా! తాము ప్రభువులు. నేను బ్రాహ్మణుడను. కోపగింపక నామనవి ఆలకింపుడు. నా కొక వ్రత దీక్షయున్నది. అది ఏమిటందురా - సంతానములేనివారి చేతి భిక్షముట్టను. కనుక నాకు శలవొసంగిన నేను వెళ్ళెదను. (అని భిక్షము తీసుకొనకుండ వెళ్లును.)

కౌ:-(కౌసల్య తిరిగి మేడమీదకువచ్చి పళ్లెము క్రింద బెట్టి విరుద్ధకంఠముతో) మల్లికా! (అని పిలచును) (పూలమాలలు కట్టుతున్న మల్లిక దేవిగారిగదికి?

మ:-(ఆదుర్దాగా) దేవిగారు! దేవిగారు!

కౌ:-ఏమే మల్లికా! ఈ దినము నన్ను పలుకరించబోకు, యిక మాలలు అవసరములేదు. నీవు వెళ్లిపో.

మ:-(భయముతో గడగడ వణుకుచు చేతులునులుముకొనుచు) దేవిగారికి ఈ దినము ఎందుకో నామీద యింత ఆగ్రహము. నా యందు అపరాధములున్న మీరే క్షమించవలెనుగాని మీరే ఆగ్రహించిన దిక్కెవ్వరు. తల్లి! (అని ఏడుపుతో కాళ్లు పట్టుకోబోవును)

కౌ:-మల్లికా! యింత-యింత బేలవేమి? నీమీద కోపముకాదు భగవానుడు చేసిన కొరతకు విచారించుచుంటిని.

మ:-అది యేవిటి మాటతల్లీ! రాజాధిరాజులు ప్రభువులు మీకేమికొరత?

కౌ:-యింకేమి కొరత కావలయును? సంతానములేని కొరతే కలదుగదా!

మ:-ఈ చిన్న కొరతకేనా మీరంత విచారించుట? సంతులేనివారు ఎందరు లేరు తల్లీ! అయినను మీకేమి కాలము తీరినది-యింక ముందుకలుగ కూడదా?

కౌ:-మల్లికా! నీది వెఱ్ఱిగానీ! యిది చిన్న కొరత గాదు, మానవుని జీవితములో ముఖ్యమైన ఘట్టమిదియే. మాకు సంతానములేనిచో రాజ్యమునకు ఎవ్వరు కర్తలు? మా రాజ్యమంతయు పరరాజుల పాలై గదా!

మ:-అమ్మా! అంత దూరపు చెడ్డ ఆలోచనలు ఎందుకు? మీకె కుమాళ్ళుపుట్టి మీరాజ్యము మీ కొమాళ్ళే యేలెదరులెండు. మీకోడలు చిన్న రాణి దగ్గరకూడా నేనే పరిచారికగానుంటాను. (అని నవ్వుతుంది మల్లిక)

కౌ:-నా కంత అదృష్టమా మల్లికా?

మ:-తప్పక అంతకంటే యెక్కువ అదృష్టమే కలుగుతుంది. పదిమంది కొమాళ్ళు, పదిమంది కుమార్తెలు కలుగుదురులెండు. మీరు చాపమీదనుండి లేచి ఆసోఫాలో కూర్చునుడు. మీకు ఈరోజు ఈ మాట జ్ఞాపకమునకువచ్చి విచారించుటకు కారణమేమితల్లీ!

కౌ:-నాకు ఈ విషయముగూర్చి యెప్పుడు జ్ఞాపకముండెనుగాని ఇంకా యెక్కువకు కారణము బ్రాహ్మణుడు భిక్షముట్టనని వెళ్ళిపోవుటె. అప్పటినుండి నామనస్సు పరిపరివిధములకలచి వేయుచున్నది.

మ:-అదియా సంగతి, ఆ మాయ బాపనయ్య ఎందుకొచ్చాడు ఇవ్వాళ, పోనియ్యండి - అన్ని బియ్యము ఆయనకు ప్రాప్తంలేవుగామోను. మనకేనయం.

కౌ:-అయ్యో మల్లిక! అలా అనకు. బ్రాహ్మణ దూషణయతిదూషణపాపము సుమా! యేదో విశేషమున్నది కనకనే అన్నారు, ఇక నన్ను ప్రశ్నించకు. నా మనస్సు చాల చీకాకుగానున్నది. నీవు వెళ్ళి ఆ ప్రాంగణముకడకూర్చునుము ఎవ్వరిని లోనికిరానీయకు.

(తెరవాలును)

(తెరబయట మల్లిక తనలో)

ఈ దేవిగారి మనస్సు మరల కుదుటపడుటెట్లు?

యథారీతిగా ప్రసన్నవదనముతో ఉండుటెట్లు మంథరనుకూడా పిలుతునా (అని ఎదురుచూచుచూ, అదుగో! యిటెవచ్చుచున్నది. (అని నిలబడును)

మం:- మల్లికా! ఎవరికొరకెదురుచూచుచున్నావు?

మ:- నీకోసమే, ఈ రోజు చిన్నరాణిగారిదగ్గిర విశేషములేమిటి?

మం:- ఏమున్నవి. మామూలు విశేషములే; ఆమె కోపము, రాజుగారు బ్రతిమాలుట, నీకు తెలియనిదేమున్నది.

మ:- నేను, ఒక, కొత్తసంగతి చెప్పెదనుగాని ఎవ్వరికిని చెప్పవుగదా?

మం:- ఎవ్వరికి చెప్పను, తొందరగా చెప్పు నా మనస్సు వేగిరపడుచున్నది.

మ:- చెప్పవుగదా! ఒట్టెయ్యి

మం:- నీతోడు (అని అరచేయి గిల్లును)

మ:- చెపుతానువిను, ఈ రోజున ప్రొద్దున ఒక బాపనయ్య భిక్షముకువచ్చెను. మనపెద్దరాణిగారు భిక్షముపెట్టబోతే, బిడ్డలులేనివారి చేతీభిక్షము ముట్టనన్నాడట. అందువల్ల పెద్దరాణిగారు చాలా కోపంగాను, దిగులుగాను ఉన్నారు!

మందర: నాకుభయంగా ఉన్నదే. నన్నుగూడ కేవాకిట్లోనే ఉండమన్నారు. నాకేమితోచకనీకొరకు చూస్తూనుంచున్నాను.

మం:- నీకింత భయమెందుకే మల్లికా! మహారాజుగారొచ్చి ఒకమారుభుజాన చెయివేసి బ్రతిమాలితేచాలు ఈ రాణులకోపాలు, గీపాలు అన్నీ పోతాయి.

మ:- అబ్బే మంధరా! కైకమ్మగారిలాగ, ఈమెకేమిలేవు. పెద్దరాణిగారు చాలా మంచివారు. రాజుగారు వస్తే కాళ్ళకు నీళ్లుతమరే యిచ్చి, మంచినీళ్ళు చేతికిస్తారు....నమస్కారముగూడా చేస్తారు, మా రాణిగారు.

మం:- సరే నేనుగూడా వెళ్లుచున్నాను. నీవుకూడా వచ్చెదవా?

మ:- రాజుగారు వచ్చువరకు నేను ఈ ప్రాంగణముననే ఉందును.

(మంధర నిష్క్రమించును)

తెరవాలును



# పరమ పిసినిగొట్టు

శ్రీ ఖండభట్టు వెంకటసీతారామరాజు

వినుడుకథఁ జెప్పెదను మీకు వేడ్కమీర
భువినిమానవులందున బొడమునట్టి
సహజముగ యూహచేత నే సర్దుకొనగ
వీలుకలిగిన జరిగిన వింతకథను

అనగ బ్రహ్మలింగయపుర మనెడియూర
పెద్దధనవంతుడగు నొక పిసినివాడు
కలడుపంటకు పొలములు కలుగుకతన
పాడికెనిలోటు లేదు యీపామరునకు

పేరుకేగాని ధనికుడు పెద్దగాక
లెక్కలేనట్టి జీవియై లేకిపోలె
కలిగియును లేనివానిలా కష్టపడుచు
కాలమును గడపుచున్నాడు కాస్తతోనె

పొట్టకైనను తినడుగపోరుతోడ
ఇంటనొకకూర మిగిలెనా నెగిరిచచ్చు
రోగమైనను మందులరుచిని చూప
ఖర్చుజేయడు సొమ్ముపై కరుణతోడ

ఎన్నిరోజులు దాగునీ యెడ్డితనము
వాడవాడలు వ్యాపించెవరుసమీర
పిన్నలాదియు వినిరట్టి పిచ్చిబ్రతుకు
కారుమార్గాలు ప్రాకెను ఖర్చులేక

కొంతకాలము గడచెను కుంటుపడక
అంతపదునాలుమైళ్ళలో నలరుచున్న
చిట్టిసోదరిగేహంబు చేరగోరి
నడిచిపోయెను నరములు నట్లువోవ

రోజురోజుకు పాకమురుచిగనుంట
మేలిరకమైన భోనము మెండుగాగ
అంటుకొనియున్న ప్రేవులనలమటింప
గర్భవాతంబున కతండుఁగట్టువడియె

ఇంకనట నిల్వగోరిన నెట్లుదగును
రోగమున బాధపడుటయురోతమిగుల
కాలినడకను బోవును కాళ్ళులాగు
కానపయనంబు గట్టనుకానిపనికి

రోడ్డుకడ కేగినీడను రోతతోడ
నిలచియుండెను కారుకై నిగ్రహమున
మొదటికారుకు చేతిని ముఖమునెత్త
బస్సుకండక్టరిట్లుగా బదులుపలికె

కాళ్ళలోసత్తువుండగ కారువలదు
ఎపుడు లేని మామూలు నీకెట్లు వచ్చె
నీవుయూరక మమ్ముల నిలుపజూడ
సమయమిదిగాదు మాతోడ సరసమునకు

ఇవ్విధంబున నల్వురు నేగిరపుడు
బస్సునిల్పక బల్కిరి బ్రధమువోలె
వేళమించగ ప్రాణము విసుగుఁజెంది
పడియెరోడ్డునదూరాన బస్సుఁజూచి

ఆపిరంతట బస్సును నడ్డముంట
దిగివిచారింపనిట్లుగాఁ దేటపడెను
అతడు మొరపెట్టనమ్మికయంతవారు
బస్సునాపకపోయిరి బట్టుదలకు

అనుచునేడ్వగ యతనిని నాదరముతో
బస్సులోపలస్థలమిచ్చి భద్రపరచి
పరమలుబ్ధుడుగావుత బాధపడుతు
పడయజాయెను మేలని పలికిరంత

కానప్రతివారు పుడమినఖిలులుకాక
తమకు గలదానితోడనె తనివితీర
తినుచునితరులకిడుచును దీపితోడ
మనిన పేరును గాంతురు మహిని నేడు






# సాహసవీరులు

శ్రీ కానాధిభట్ల వెంకటసుబ్బారావు

(గతసంచిక తరువాయి)

శివబంటు మంచితీర్థంకోసం బయలుదేరాడని చెప్పానుకదూ! మంచినీరుకోసమని బయలుదేరిన శివబంటు దారితప్పిపోయాడు. అందువలననే అతనికి కోలని జాడ కనిపించలేదు. అలా దారి వెతుక్కుంటూ వెళుతుండగా ఒక అజానుబాహుడు ఒంటెనెక్కి అటుగా రావటం చూశాడు. ఆ మానవమాత్రుడిని అంత అరణ్యంలో చూసేసరికి అతనికి ప్రాణం లేచి వచ్చినట్లయింది. గబగబా అతని దగ్గరకు వెళ్లి — "బాబ్బాబు, మీకు పుణ్యముంటుంది. కోలనుకు దారి ఎటో చెప్పి పుణ్యం కట్టుకోండి—" అని అడిగాడు. శివబంటు మాటలకు అజానుబాహుడు నవ్వుతూ — "నీకు మంచినీరు కావాలా?" అని అడిగాడు. "అవును బాబూ!" అని అన్నాడు.

"నాదగ్గిర మంచినీరుంది. నీకు కావలిస్తే తీసుకో" అన్నాడు.

"అలాగే! ఇప్పించండి!" అన్నాడు.

అజానుబాహుడు మంచితీర్థాన్ని తన తోలు సంచిలోనుండి తీసి శివబంటు తోలుసంచిలో పోశాడు. దప్పిక బాగా అవటంతో కొంచెం నీరు త్రాగుదామని సంచీ ఎత్తాడు. ఒక గ్రుక్క నీటిని త్రాగాడో, లేదో మరుక్షణంలోనే మైకంకమ్మి పడిపోయాడు.

తెలివి వచ్చి కళ్లువిప్పి చూచేసరికి శివబంటు ఒక చీకటిగదిలో పడివున్నాడు. ఒక్కసారి గావుకేక పెట్టి లేచి కూర్చున్నాడు. ఈ కేకవిని ఒకడు అక్కడికి పరుగెత్తుకుంటూ వచ్చి — "ఎందుకు అరుస్తున్నావ్?" అని అడిగాడు.

"ఎందుకేమిటయ్యా! నీ వొకసారి ఈ గదిలో కూర్చుని చూడు. తెలుస్తుంది. మహామాట్లాడుతున్నావ్ గాని" అన్నాడు.

"చాల్చాల్లేకాని ఇహ నోరుమూసుకుని కూర్చో. అట్టే వాగావంటే రాక్షసుడు వచ్చి గుటకాయి స్వాహా చేస్తాడు!" అన్నాడతడు.

"అమ్మో! రాక్షసుడే! మంచితీర్థంలో మత్తు కలిపి ఇచ్చి ఇలా తెచ్చిపడేశాడు వాడేనా రాక్షసుడు? ఎంత సాధువులా నటించాడు. బాబ్బాబు! నీకు పుణ్యముంటుంది. నన్ను విడిపించు. నేను త్వరగా వెళ్లిపోవాలి!"

"నేనూ త్వరగా వెళ్లాలి. మరి నన్ను విడిపించేవారెవరూ!"

"చచ్చాం పో, నువ్వూ నాబోటి అభాగ్యుడివే నన్నమాట".

"చెప్పాలా స్వామీ! కాస్సేపు నోరుమూసుకు కూర్చోండి. లేకపోతే రాక్షసుడు వచ్చి, నిన్నూ నన్నూ స్వాహా అనిపిస్తాడు" అన్నాడు.

"అయ్యబాబోయ్!"

"ఇదిగో అబ్బీ! మా నాయకుడిని ఎదిరించావో నీకు రోజులు మూడినయే. ఎక్కడైనా అమాయకుడు కనిపించితే చక్కా ఎత్తుకొచ్చి వాడిని నౌకరుగా వుపయోగించుకోవటం. వాడిని ఎదిరించకుండా వున్నంతకాలం మంచిగానే వుంటాడు. ఎవరైనా వాడిని ఎదిరించారో గుటకాయిస్వాహా. అబ్బీ! నీ పనికూడా అంతేకాబట్టి జాగ్రత్తగా మెసులుకో.!"

ఇంతలో పెద్దకేకలు వినిపించినయ్. శివబంటు వులిక్కిపడి "ఏమిటా కేకలు" అని అడిగాడు.

అతడు వెనక్కి వెళ్లి తిరిగి వచ్చాడు. "అలా ఆ కిటికీ కంతనుంచి రాక్షస మందిరంలోకి చూడు. నీకే కనపడుతుంది ఆ దృశ్యం" అన్నాడు. శివబంటు కళ్ళు వత్తిగించి చూశాడు అటువైపు.

రాక్షసుడు సేవకుని గిరగిరా త్రిప్పి నేలకేసి కొట్టాడు. వాడు నెత్తురు గక్కుకుని గుటుక్కుమన్నాడు. వెంటనే ఒక కాలుపట్టుకొని చీల్చి పరపరా నమలటం మొదలెట్టాడు.

"అబ్బ! ఎంత ఘోరం!" అని చెవులు మూసుకున్నాడు శివబంటు.

"ఎదురు తిరిగావా నీపని కూడా అంతే-!" అన్నాడు.

"ఇదిగో ఇటుచూడు. మరి ఇంతఘోరాలు చేస్తుంటాడే వీడ్ని చంపకుండా అట్టే పెట్టారేం".

"భలేవాడివయ్యా వీడిని చంపటమంటే మాటలా- దేవతలూ, గంధర్వులే వీడితో పోరి ఓడిపోయారు. నివ్వూ, నేనూ ఒక లెక్కా. వస్తా" అని వెళ్లిపోయాడు.

"చూస్తావుగా నా తడాఖా!" అని మీసం మెలియ వేసుకున్నాడు శివబంటు.

కొంచెంసేపు అయినతర్వాత రాక్షసుడే అక్కడికి వచ్చాడు. ఆ రాక్షసుని చూడగానే శివబంటు గడగడా వణికిపోయాడు.

రాక్షసుడు నవ్వుతూ "అలా వణుకుతున్నావేం చలిరోగమా?" అడిగాడు గర్వంగా.

"మాయరోగం!" అని మనసులోనే అనుకొని రాక్షసుని కాళ్లను వాటేసుకున్నాడు. వాడు ఆశ్చర్యపోయాడు.—"దిక్కులేనివాడిని. మీ కొలువులోనే వుంచుకోండి. మీ సేవచేస్తూ ధన్యత పొందుతాను" అన్నాడు.

వాడి వినయవిధేయతలను చూచేసరికి రాక్షసుడు వుబ్బిపోయి — "నిజమైన సేవకుడివంటే నువ్వేనోయ్. భేష్! నిన్ను నా సేనాధిపతిగా నియమిస్తున్నాను-" అన్నాడు.

'అంతకంటేనా దొరా!'

"ఇంకేముంది! శివబంటు వాడిని కాస్తా బుట్టలో వేసుకుని సేనాధిపతిగా నియమింపబడ్డాడు—".

రెండు రోజులు గడిచినతర్వాత రాక్షసుడొకసారి శివబంటు దగ్గరకు వచ్చి - "ఏరా! అబ్బీ! నేనొక పని చెపుతా చేసిపెడతావ్?" అని అడిగాడు.

"అంతకంటేనా చెప్పండి-!" అన్నాడు.

"నా పేరేమిటో తెలుసా! అట్టహాసుడు! ఇలా రా!" అని కొంచెం దూరం తీసుకుపోయి-"ఈ నా గది ప్రక్కనే ఒక అరుగుంది. అరుగు లోపలగా వెళితే ఒక ద్వారం కనిపిస్తుంది. ఆ ద్వారం గుండా వెళితే ఒక పెద్ద వరండా అగుపిస్తుంది. ఆ వరండా ముందుగదిలో ఒక రాజకుమార్తె వుంది. దానిని ఎంత సాధించినా నన్ను పెళ్లిచేసుకోనంటుంది. దాన్ని వప్పించి వచ్చావో నీకు బ్రహ్మరథం పడతాను. ఏమంటావ్" అన్నాడు.

"ఓష్ ఇంతే కదా! ఇంకా ఏదో పెద్దపని అనుకున్నాను!"

'అరి పిడుగా! ఇది చిన్నపనా!' అని ఒక్కసారి వాడి వీపుమీద చరిచి; "నాకు తెలుసు నువ్వు అసాధ్యుడివని. ఇలారా!" అని అరుగు దగ్గరకు వెళ్లి తన చేతిగొళ్లెంతో రెండు మూడుసార్లు కొట్టాడు. వెంటనే అరుగు రెండుగా విడిపోయి ద్వారం కనిపించింది "త్వరగా లోపలకు వెళ్లు; ఈ దారినే నేను ఇక్కడే వేచుకూర్చుంటాను!" అనివాడిని లోపలికి పంపించి రాక్షసుడు అక్కడే తిష్టవేశాడు. సరేనని శివబంటు ద్వారంగుండా బయలుదేరాడు. ఇంతలో రాక్షసుడు వెనక్కు పిలిచి "ఇదిగో ఈ తాయెత్తు నీ దగ్గర వుంచుకో. ఆమెను సర్పాలు కాపలా కాస్తూ వుంటాయ్. నీ మీదికి సర్పాలుదూకి రాగానే ఈ తాయెత్తు వాటికి చూపించు. ఆ దెబ్బతో అవి వెనక్కు తగ్గి నీకు మార్గమిస్తయ్!" అన్నాడు.

"సరే" నని శివబంటు తాయెత్తు తీసుకొని ద్వారం గుండా బైలుదేరాడు. వరండా చేరుకొని ముందుగది దగ్గరకు వచ్చాడు. రాక్షసుడు చెప్పినట్లుగా ఆ గదిని కాపలా కాస్తున్న సర్పజాలం బుస్సుమంటూ మీదికొచ్చినయ్. కాని శివబంటు తాయెత్తు చూపగానే అవి వెనక్కు తగ్గి దారినిచ్చాయి. శివబంటు సరాసరి గదిలోకి వెళ్లాడు. అక్కడ రాజకుమార్తె మోకాళ్లపై తల ఆనించి వెక్కి వెక్కి ఏడుస్తూ కూర్చుంది. శివబంటును చూడగానే ఒక్కసారి అదిరిపడి లేచింది. "ఇలా మాయ రూపాలు ధరించి నన్ను ఏడిపించటంకంటే నా పీక పిసికి చంపిపారేస్తే పీడానే వదిలి పోయేదిగా-" అంది ఏడుస్తూ.

(సశేషము)

# మోసాన్ని మోసంతోనే...!

శ్రీ బొడ్డుపల్లి కృష్ణావధాని

ఒక గ్రామములో రంగారాయుడనే నేత్రవైద్యుడొకడుగలడు. నేత్రవైద్యంలో అందవేసిన చేయేగాని ధనాశ మెండు. ఆగ్రామములోనే ధనికురాలైన రమణమ్మ అను నామెకు కండ్లలో పువ్వులు పూసి కళ్ళు పోగా ఆమె డాక్టరుగారికి కబురుపెట్టెను.

డాక్టరుగారు వెళ్ళి కళ్ళు పరీక్షచేసి నయమగుననియు, రెండు నెలలు పట్టుననియు చెప్పి, తనకు ఫీజుగా అయిదువందల రూపాయలు నయమయిన పిదప ఈయవలెననెను. అందులకు రమణమ్మ ఒప్పుకోనగా ఆ రోజునుంచే డాక్టరు ప్రతిదినము పరీక్షించి మందులు వాడసాగెను. ఆమె ధనికురాలు అగుటచే కావలసినన్ని కుర్చీలు, డ్రాయర్లు, బీరువాలు గలవు. ఆ ఇంటిలో ఆమె, ఇరువురు నౌకర్లు తప్ప మరెవరులేరు. డాక్టరు దురాశకుపోయి, రోజూ తన నౌకర్లచేత ఏదో ఒక కుర్చీయో, బీరువాయో, మోయించుకొని పోవుచుండెను. కొన్ని దినాలలో ఇల్లు గుల్లఅయ్యెను. ఈ సంగతి ఎప్పటికప్పుడు రమణమ్మ తన నౌకర్లవల్ల వినుచునే ఉండెను. వారికి (నౌకర్లకు) డాక్టరు "మరల పంపెదనని" చెప్పుచుండుటచే, వారడ్డగింపరైరి.

బుద్ధి పాడుబుద్ధిగాని, వైద్యంలో ఘటికుడేగా డాక్టరు. అన్నప్రకారం రెండు నెలల్లో కళ్లునయంచేసి నా ఫీజు నా కిమ్మన్నాడు. కాని రమణమ్మ నాకింకా దృష్టి రాలేదన్నది. డాక్టరు మరికొన్ని దినములు మందు వాడిచూచెను. ఇంకనూ రమణమ్మ దృష్టి రాలేదనుచుండెను.

తనకు డబ్బు ఇయ్యవలసివచ్చెనని, రమణమ్మ ఈ పన్నాగంపన్నినదని డాక్టరు గ్రహించి, న్యాయాధికారివద్ద ఫిర్యాదు చేసెను రమణమ్మమీద.

న్యాయాధికారి ఒకరోజు రమణమ్మను పిలిపించి "రమణమ్మా, డాక్టరుగారు కళ్లు నయంచేసినందుకు, ఆయనకు ఐదువందల రూపాయలు ఇస్తానన్నావుట నిజమేనా" అనెను.

"నిజమే" అని రమణమ్మ సమాధానమిచ్చెను.

"ఇపుడు నీ కళ్లు నయమయినవిగదా, ఆయన కీయవలసిన 500 రూ. ఎందుకియ్యలేదు?"

"నాకళ్లు ఇంకా నయంగాలేదుగదా!" రమణమ్మ అనెను.

'అదేమిటి శుభ్రంగా చూచుచుంటివి, అన్నిపనులుచూచుకొనుచునే ఉంటివికదా'

"అన్నిటిని చూడగలుగుచున్నాను గాని, నా యింటిలో ఉండవలసిన కుర్చీలు బీరువాలు, డాక్టరుగారింట్లో చూచుచున్నాను. అవి నాయింట్లో కనబడుటలేదు. అవి నాయింట్లో కనబడితే నాకు పూర్తిగా దృష్టివచ్చినట్లే!!" అనెను.

నిజం తెలుసుకున్న న్యాయాధికారి డాక్టరును చివాట్లుపెట్టి రమణమ్మ సామాను రమణమ్మ కిప్పించి, డాక్టరుకు రమణమ్మ ఫీజు ఈయనవసరంలేదని తీర్పు చెప్పెను.

చూచారా! బాలలూ ఎలా మోసాన్ని మోసంతోనే యుక్తిగా జయించిందో రమణమ్మ.

# అమెరికన్ లఘుపరిశ్రమల ప్రదర్శనం

## స్వల్ప వ్యయంతో పిన్నలకు పెద్దలకు పుష్టికరమైన ఆహారం

## గోధుమ సోయా బీన్లతో రకరకాల వంటకాలు

—(o)—

కొన్నేళ్ల క్రితం అమెరికన్ వ్యవసాయవేత్తల బృందం ఒకటి పశ్చిమ ఆసియాలో పర్యటిస్తూ, అక్కడి ప్రజల దేహదార్ఢ్యత, దీర్ఘాయువు, స్ఫురద్రూపం, మంచి ఆరోగ్యం చూచి ఆశ్చర్యపడి వారు తీసుకొనే ఆహారం గురించి దర్యాప్తు జరిపింది. వారి ముఖ్యాహారం "బల్గార్" అని తేలింది. గోధుమను మూతలేని పాత్రలో ఉడికించి, ఎండలో ఎండించి ఆ ఆహారం తయారుచేసుకొంటారు.

అమెరికా వ్యవసాయశాఖవారికి ఈ విషయాన్ని ఆ బృందం తెలియజేసింది. ఆ ఆహారాన్ని తక్కువ వ్యయంతో, ఆధునిక పారిశ్రామిక విధానాలద్వారా తయారుచేస్తే ప్రపంచంలో లక్షలాది ప్రజల ఆహార సమస్యలు కొంతవరకు తీరిపోవచ్చునని భావించారు. అమెరికాలో ఒక యంత్రాలయం నిర్మించి, రెండేళ్లు కృషిచేసి ఆ ఆహారపదార్థాన్ని తయారుచేశారు.

అమెరికా లఘుపరిశ్రమల ప్రదర్శనం (మద్రాసు) లోని వ్యవసాయ విభాగంలో బల్గార్‌తో చేసిన ప్రయోగ ఫలితాలను ప్రదర్శిస్తారు.

అన్నం వండినట్లే తయారుచేసేటందుకు వీలైన సలార్‌ను అన్నానికి బదులుగా ఉపయోగించవచ్చును. బియ్యంతో దానిని ఇష్టమొచ్చినన్ని పాళ్లలో కలిపి అన్నం వండవచ్చును. పరిశుభ్రమైన బియ్యంతో వండిన అన్నం ఎలాంటి కమ్మని వాసనవేస్తుందో, బల్గార్ కూడా అంతే. గోధుమలోని అన్ని విటమిన్లు, లోహపదార్థాలుగల బల్గార్ పిల్లలకూ, వృద్ధులకూ, విద్యార్థులకు, కాయకష్టం చేసేవారందరికీ పుష్టికరమైన ఆహారం.

మద్రాసు ప్రదర్శనంలో బల్గార్ మొదలైన గోధుమ పదార్థాలను ఎట్లా తయారుచేయాలో వివరించి చూపుతారు. గోధుమతో "డౌనట్లు" అనే పిండివంట తయారుచేయవచ్చును. నిమిషానికి డజన్ డౌనాట్ల చొప్పున తయారుచేసే యంత్రం ఏలా పనిచేస్తుందో అక్కడ ప్రదర్శిస్తున్నారు.

దక్షిణ భారతదేశంలో పేరుగాంచిన ఆహారం సోయాబీన్స్. ప్రపంచంలో పలుతావులలో ఈ చిక్కుళ్లను ప్రజలు ఉపయోగిస్తున్నారు. బలవర్ధక గుణానికి పేరెన్నికగన్న సోయాబీన్లతో తయారైన 20 పదార్థాలను సోయాబీన్ కౌంటర్‌లో ప్రదర్శిస్తారు. సహజసిద్ధంగా ప్రొటీన్లు విరివిగా ఉండే వాటిలో పేరెన్నికగన్న సోయాబీన్స్‌తో రకరకాల ఆహారాలు తయారుచేసుకోవచ్చును. భారతీయుల ఆహారంలో ప్రొటీన్ల కొరతమూలంగా కలిగే నష్టాలను పోగొట్టేటందుకు అనేక పరిశోధనలు జరుపుతున్నారు. మున్ముందు ఈ దేశంలో సోయాబీన్లను విరివిగా పండించవచ్చును.

అమెరికాలో బలవర్ధకమైన ఉదయపు ఆహారాలు, రొట్టెలు, పసిపిల్లల ఆహారాలలో సోయాబీన్లను ఉపయోగించి సమృద్ధిగా విటమిన్లు లభించేట్లు చేస్తున్నారు. ప్రొటీన్ల విలువగల ఆ సోయాబీన్లను ఉపయోగించాలని భారతదేశంలో గాంధీజీ కూడా సిఫార్సు చేశారు.

అమెరికా వ్యవసాయ విభాగంలో అమెరికన్ పాడికేంద్రం ఎలా పనిచేస్తుందో సుదాహరణంగా చూపిస్తారు. దానిలో పాలుపొడితో ఐస్‌క్రీమ్ ఎలా తయారుచేస్తారో, వెన్నను ఎలా తీస్తారో చూపిస్తారు.

ఆ పాడికేంద్రంలో స్టెయిన్‌లెస్ స్టీల్ పాశ్చ్యురైజర్, హోమొజెనైజర్, మిల్క్ కూలర్, మిల్క్ డిస్పెన్సర్, మిల్క్ స్టోరేజి వాట్, ఐస్‌క్రీంమిక్సర్ మేకర్, ఫ్రీజర్, హార్డనింగ్ కాబినెట్లు, క్లీనింగ్ పరికరాలు ఉన్నవి.

అమెరికా వాణిజ్యశాఖ, అమెరికా వ్యవసాయశాఖ తాలూకు విదేశ వ్యవసాయ విభాగమూ, భారతదేశంతో సహా 49 దేశాలకు ప్రాతినిధ్యం వహిస్తున్న అంతర్జాతీయ పాడిసంఘమూ సహకార కృషి ఫలితంగా 'పాడి ప్రదర్శన' నిర్వహణ సాధ్యమయింది.

పాడి ప్రదర్శనంలోని పరికరాలు, పాడి కేంద్ర కార్యకలాపాలు, నిర్వహణగురించి ఏ విషయాన్నయినా చర్చించేటందుకు నిపుణుల బృందం ఒకటి అక్కడ సిద్ధంగా ఉంటుంది.

# మతకర్తలు : తద్వ్యక్తిభేదములు

[పయిశీర్షికతోఁ గొన్నివ్యాసములు 'గృహలక్ష్మి' లో ప్రతిమాసము వెలువరింపఁ దలంచితి. అందిది మొదటిది.]

శ్రీ వేదం వేంకట కృష్ణశర్మ

పరమశివుని యపరావతారమూర్తిగ నెన్నఁబడు శ్రీ శంకరాచార్యుని జన్మకాలమునుగూర్చి యింకను బరిశోధకులు 'ఇదమిత్థ'—మని నిర్ణయింపఁ జాలకున్నారు. వారిలో గల బహువిధాభిప్రాయముల ననుసరించి అది, క్రీ.శ.—ముందు ఆఱవశతాబ్దము నుండి, క్రీ. శ.— వెనుక తొమ్మిదవ శతాబ్దమువఱకు పలురకములుగఁ గలవు. కొందఱు దైవజ్ఞులు జ్యోతిషము నాధారపఱచుకొని, శ్రీ ఆచార్యుఁడు క్రీస్తు పుట్టుటకు ముందే జనించినవాఁడని నిశ్చయించిరి. శంకరాచార్యుడు స్థాపించిన మఠముల ప్రాచీనతను పరిశీలించుచో, ఆయన పుట్టుకనుగూర్చిన దైవజ్ఞుల సిద్ధాంతము సుస్థిరమని తేలుచున్నది.

శ్రీభగవత్పాదుఁ డవతరించిన దినమునుగూర్చి యేది యెట్లున్నను, కేవలము తర్కింపక ఆయన వైశాఖమాసమున శుక్లపక్షపు యైదవ దినమున జన్మించెననుటను ఎవ్వరుగాని త్రోసివేయజాలరు. ఆయన దక్షిణభారతములోని కేరళరాష్ట్రమున పూర్ణానది యొడ్డున గల 'కాలతి' అను గ్రామమున మత విధానములయందు కడు నిష్ఠాగరిష్ఠుఁడగు శివగురువను విద్వద్బ్రాహ్మణునకు జనించెను. ఆయన తల్లిపేరు సుభద్ర. వార్ధకము హెచ్చుచున్నకొలది ఆ దంపతులకు సంతానమునుగూర్చిన చింత మిక్కుటము కాజొచ్చెను. కావున నాదంపతులు భగవంతుఁడగు శివుని నింకను మిక్కుటముగ సేవించుటయందు, నర్చించుటయందు శ్రద్ధ జూపుచుండిరి. పరమేశ్వరుఁడు, వారిభక్తిని మెచ్చుకొని యా బ్రాహ్మణదంపతుల కొక కుమారుఁడు జన్మించగలఁడనియు, నతఁడు సద్గుణసంపన్నుఁడగుననియు, నష్టసిద్ధులచేత బ్రకాశింపఁ గలఁడనియు వరమిచ్చి మఱఁగిపోయెను.

ఈశ్వరుని వరము పొల్లుపోకుండ వారికి కొన్నినాళ్లకు చక్కని కుమారుడు జన్మించెను. ఇట్టి భగవదనుగ్రహము ననుసరించి తమ కృతజ్ఞతను శంకరుని యెడ జూపనెంచి యా కుమారునకు 'శంకరుఁ' డనియే నామకరణ మొనర్చిరి.

బాల్యదశలోనున్న యీ శంకరుఁడు అసాధారణమైన శక్తులు గలిగి భూలోకమున కవతరించుటకు మునుపు అనేక చిహ్నములను వారు కనుగొనిరి.

మొదటి సంవత్సరము పూర్తి యగుసరికి అతఁడు తన మనోవీధిని దోఁచు దైవికభావముల నతఁడు వెలువరింప నారంభించెను. రెండవ సంవత్సరము పెట్టగనే యతఁడు తన తల్లి చెప్పుచుండగా వినిన పౌరాణిక గాథలను మఱల చెప్పగలిగినంతటి వాడయ్యెను. మూఁడవయేడు మొదలిడగనే యతని కక్షరాభ్యాసమయ్యెను. ఆవెనుక కొలఁదికాలమునకే యతనితండ్రి జీవయాత్ర ముగించెను.

అతఁడయిదేండ్ల యీడు గలవాఁడు కాగానే యుపనీతుఁడై వేదాభ్యాసము చేయ గురువుకడ వదలిపెట్టబడెను. శంకరుఁ డేడవయేటిలోపల (రెండేండ్లకే) వేదములు వేదాంతశాస్త్రము వేదాంగములు పూర్తిగ నభ్యసించి యింటికి తిరిగివచ్చెను. అతని యలౌకిక చాతుర్యమును విజ్ఞానమును గ్రహించిన యతని యుపాధ్యాయవర్గము ముగ్ధమయ్యెను. చుట్టములు, మిత్రులు, తక్కినవారు నాతనియెడ నిశ్చలమగు భక్తిప్రపత్తులతో మెలఁగుచుండిరి.

విద్యాసమార్జనము సంపూర్తి కాగానే శంకరుఁడు సన్యాసాశ్రమము స్వీకరించి ప్రాపంచికసుఖములను రోసి, ఆత్మానుసంధానము చేయుచుండెను. తుదకతఁ డేవిధముగనైన తాను పరివ్రాజకత్వము బొందవలెనను కుతూహలముతో దల్లి నుత్తరువునిమ్మని ప్రాధేయపడెను. కాని, యాయమ యేమాత్రము కుమారుని యభిప్రాయమును మన్నింపదయ్యెను. తన విధ్యుక్తధర్మములను నెఱవేర్చుటలో వెను కడుగు వేయని కుమారుఁడగుటచేఁ దనతల్లి యాజ్ఞను దిరస్కరించి, 'యామె మనస్సునకు విచారముఁ గలిగించి, బలాత్కారముగ ఇంటినుండి వెడలిపోయి సన్యాసము స్వీకరింప నిచ్చగింపఁడయ్యెను.

ఒకానొకదిన మతఁడు తనతల్లితోఁగూడ సమీపస్థమగు నేటికి స్నానమొనర్ప నేఁగెను. శంకరుఁడు నదిలోనికి దిగుటయు తటస్థముగ [illegible] వానిని [illegible]

గులం బట్టికొని నీటిలోనికిందిగిచెను. అట్టియెడ
మృత్యుదేవతచే జిక్కిన తనకుమారుని యవస్థను
గాంచి సుభద్రాదేవి, విచారాశ్చర్యసంభ్రమములు
ముప్పిరిగొన్న చిత్తముగలదయి, సహాయము కొఱకు
బిగ్గఱగ మొఱవిడెను. అటిస్థితిని పుత్రుడు జననితో
'తల్లి, నీవు సన్న్యాసము స్వీకరింప ననుమతి యొసం
గుచో నాకీజలజంతువు నోటినుండి విమోచనము గలు
గును'— అని యనెను. వెంటనే ఆమె యేమాత్రము
జాగుసేయక తురీయాశ్రమ స్వీకారమునకు సమ్మ
తించెను. మొసలియు శంకరుని వదలి లోతునీటిలో
నదృశ్యమయ్యెను. ఈరీతి నతఁ డెనిమిదవయేటనే
పరివ్రాజకత్వము వహించెను. అప్పు డాతఁడు
'అమ్మా! నేను లోకోద్ధరణార్థము జన్మించితి. కనుక
నాకు నాజన్మసీమతోను, గృహముతోను ఇఁక నేమి
ప్రయోజనము ?— దేశసంచార మిటనుండియే
ప్రారంభింతును. కాని, నాతల్లివగు నీవు మరణ
శయ్యపై నున్నపుడు తప్పక మరల నిన్నుఁ గలిసి
కొందును. విచారపడకుము'— అని యోదార్చెను.

అంతట నతఁ డన్నియుఁ బరిత్యజించి, నర్మదా
తీరమున నున్న స్వామి గోవిందభగవత్పాదుని
దర్శింప నేఁగెను. ఆ మహనీయుఁ డాతనికి బోధింప
వలసిన వెల్ల బోధించి, అతని సంకల్పమునకు దోహ
దము గలిగించెను. అంతియగాక, అతనికి 'భగవత్పూ
జ్యపాదాచార్యుఁడు'— అను పేర నొసంగెను. శంక
రుఁడును తత్త్వవివేచనముతో ఆధ్యాత్మికదృష్టి నల
వఱచుకొనుటకును, అనుభవము గడించుటకును దగు
రీతి నభ్యాస మనుదినము జేయుచు, సాత్త్వికసంప
న్నుఁడై సిద్ధినొందిన మహాత్ముఁడయ్యెను. శిష్యుని
ఆధ్యాత్మిక తేజస్సందర్శనభాగ్యమున కానందపడిన
గోవిందభగవత్పాదుఁ డతని వారణాసికి పోయి,
వేదాంతసూత్రములకు సమగ్రవ్యాఖ్య వ్రాయుమని
యాదేశించెను. గురూద్దిష్టము గొనసాగింపఁ గాశికి
వచ్చిన శంకరునికిమున్నే యాతనికీర్తికాంత యానగ
రమున అత్యంతవ్యాప్తి నందియుండెను. కావున, అతని
కనేకులు శిష్యు లాపుణ్యక్షేత్రమున దొరసిల్లిరి. అందు
ప్రథముఁడు 'సనందనుఁడు'. ఆ తరువాత నతఁడే
పద్మపాదాచార్యుఁడని ప్రఖ్యాతి వహించెను. ఆ
యవిముక్త క్షేత్రమున నతఁడు తన్నుఁ జేరిన శిష్యు
లను ప్రబోధించుటయే కాక, తన తాత్త్వికోపదేశగ్రం
థములను పూర్తిచేయవలసియు నుండెను. కాశీపురా
ధీశ్వరుఁడగు విశ్వనాథస్వామి, ఒకానొకనాఁడు
చండాలరూపముతో శంకరునియెదుట ప్రత్యక్ష
మయ్యెను. కాని, వెంటనే భగవత్పాదుఁ డాతని
పరమశివునిగ గుర్తించి యర్చించెను. ఈశ్వరుఁ డాతని
భక్తికి మెచ్చి, బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యానము
వ్రాయుమనియు, వైదికమతముంగూర్చి భరతఖండ
మునం దెల్లెడఁ బ్రచారమొనర్పుమనియు నానతి
చ్చెను. ఇట్లుండ, బ్రహ్మసూత్రవ్యాఖ్యానము పూర్తి
కాఁగానే, యొకనాఁడు గంగాతీరమున నున్న
శంకరుం జూడవచ్చిన అజ్ఞాత బ్రాహ్మణుండొకఁడు
ఒకానొక సూత్రభాష్యముంగూర్చి వివరింపుమని యడి
గెను. ఆసూత్రార్థమును గూర్చి యాబ్రాహ్మణునికిని,
శంకరునికిని ఎనిమిది దినము లెడతెఱపి లేని వివాద
ములు జరిగెను. తన్మూలమునకు తనవ్యాఖ్యార్థమే
పొసఁగియున్న విధమును విస్పష్టమొనర్చి, తన సిద్ధాం
తమే సరియైనదిగ నిరూపించి యావిప్రు సంతృప్తి
నొందించెను. ఆద్విజరూపుఁ డెవ్వడోకాఁడు; వేద
వ్యాసుఁడే యని శ్రీ శంకరుని కావల తెలియవ
చ్చెను. వెంటనే ఆచార్యుఁ డాతనియడుగులపైఁ బడి
నమస్కరించి— 'మహాత్మా! నాయవినీతిని
క్షమింపు'— డని వేడికొనెను. అంత మహర్షియు,
శంకరునిఁ జూచి, "నీవిటనుండి అద్వైతమతమును
గూర్చి దేశములో ప్రచారమొనర్పుము. అందులకయి
యాయువును పదునాఱేండ్లనుండి ముప్పదిరెండేం
డ్లకుఁ బొడిగించెదను. ఏమాత్రము జాగుసేయక
విధ్యుక్తమగు నీమతబోధ సాగింతువుగాక!"— అని
దీవించి మఱుఁగయ్యెను.

శంకరుఁడు అదిమొదలు అనేక పుణ్యక్షేత్రములు
(కురుక్షేత్రము, బదరికారామము మున్నగు స్థలములు)
సందర్శించి, ఇతర మతప్రబోధకులను, ప్రవక్తలను—
వాదములలో జయించి, అద్వైతము స్థాపింపఁదగు
శ్రద్ధను గైకొనెను. సంస్కృతిగ్రంథవాహినియు
ఆతనినుండి యుత్పత్తినొంది, తెలియనిరీతి ప్రవ
హించు ఊటకాలువవలె నొప్పార మొదలిడెను.
శంకరుఁడు ప్రయాగక్షేత్రమున చావుసెజ్జ నాశ్ర
యించియుండిన కుమారిలభట్టును సందర్శించెను. అతని
యాదేశానుసార మాచార్యుఁడు మాహిష్మతీపురమున
కేఁగి మండనమిశ్రునితో మతసంబంధములగు చర్చ
లలోఁ బాల్గొనెను. శంకర మండనమిశ్రుల వాగ్వి
వాదములలోఁ దీర్పరిగ, మండనునిభార్యగ నవతరించి
యున్న భారతియే నియమితురాలయ్యెను. కడకు
గెలుపు శంకరునిదే యయ్యెను. మండనమిశ్రుఁ డోడి
పోయి, ఆచార్యునకు శిష్యుఁడై సన్న్యసించి, సురే
శ్వరాచార్యుఁ డనఁబరగుచుండెను. పిదప శంకరుఁడు
దేశము నాలుగుచెఱఁగుల యాత్రలొనర్చి, అందందు
మఠములు వెవ్వేఱుగ స్థాపించి, ఉపనిషదుద్బోధ
లొనర్చి, యద్వైతమతము వ్యాప్తియగునట్లు సౌక
ర్యము గలిగించెను. (సశేషము)




గతనెల 23వ తేదీన గోపాల్ ప్రొడక్షన్స్‌వారు తమ జానపదచిత్రం 'కామమ్మ కథ' నిర్మాణమునకు ప్రారంభోత్సవము జరిపారు. పలువురు పురప్రముఖులు, నటులు ఉత్సవంలో పాల్గొన్నారు. ఈ చిత్రమునకు నిర్మాత శ్రీ ఆకుల లక్ష్మయ్య. దర్శకుడు శ్రీ యస్. వి. స్వామి. రచన శ్రీ అయ్యగారి విశ్వేశ్వరరావుగారిది. చిత్రనిర్మాణం శరవేగంతో సాగుతున్నదని వార్త.

♦ ♦ ♦

భాస్కర్ ప్రొడక్షన్స్‌వారి 'మనోరమ' చిత్రం అక్టోబరులో విడుదల అగుతుందంటున్నారు.

♦ ♦ ♦

వరలక్ష్మి పిక్చర్స్‌వారు నిర్మించపూనుకున్న చిత్రం వీనస్ స్టూడియోస్‌లో రూపొందుతున్నది. అశ్వత్థామ సంగీతము, K. B. నాగభూషణంగారి దర్శకత్వము, సదాశివబ్రహ్మంగారి కథారచన యీ చిత్రానికి హంగులు. జగ్గయ్య, జమున, గుమ్మడి ప్రధానభూమికలను నిర్వహిస్తున్నారు.

♦ ♦ ♦

నేషనల్ ఆర్ట్ థియేటర్సువారు 'సీతారామ కళ్యాణం' చిత్రాన్ని నిర్మించడానికి చురుకుగా ప్రయత్నాలు చేస్తున్నారు. దీనికి శ్రీ యస్. రాజేశ్వరరావు సంగీతదర్శకత్వము నిర్వహిస్తున్నారు,

♦ ♦ ♦

పొన్నలూరివారి 'దైవబలం' చిత్రం యీనెల 17వ తేదిన విడుదల కాబోతున్నది.

♦ ♦ ♦

ప్రకాష్ ప్రొడక్షన్స్‌వారి 'రేణుకామహాత్మ్యము' కూడ అక్టోబరులోనే విడుదల కాగలదనుకుంటున్నారు. జి. వరలక్ష్మి, గుమ్మడి, రాజనాల మొదలగువారు నటించిన యీచిత్రానికి శ్రీప్రకాశరావు దర్శకులు. డి. వి. నరసరాజుగారు మాటలు, పాటలువ్రాశారు.

♦ ♦ ♦

గోపీకృష్ణా ఫిలింస్‌వారు ధనలక్ష్మి పిక్చర్స్‌వారి 'మహారథకర్ణ' చిత్రాన్ని త్వరలో విడుదల చేయబోతున్నారు.

వెనిసిలా ప్రొడక్షన్స్‌వారి 'కృష్ణపాండవయుద్ధం' సయితం విడుదలకు సిద్ధంగానున్నదని వార్తలు.

♦ ♦ ♦

సంగీతా ప్రొడక్షన్స్‌వారు 'మామకు తగిన అల్లుడు' అనే హాస్యరసభరితమయిన చిత్రాన్ని శ్రీ వేదాంతం రాఘవయ్యగారి దర్శకత్వం క్రింద నిర్మిస్తున్నారు. ఇందులో రేలంగి, బాలకృష్ణ, చలం, సావిత్రి మున్నగువారు నటిస్తున్నారు.

♦ ♦ ♦

నల్లపురెడ్డి ప్రొడక్షన్స్‌వారి 'పెద్దకోడలు' చిత్రము యస్. యస్. రాజేంద్రన్, బాలాజీ. పండరీబాయి, సూర్యకళ, యస్. వి. రంగారావు మున్నగు నటీనటులతో నిర్మాణం సాగినది. డబ్బింగ్ కార్యక్రమం చురుకుగా సాగుతున్నది.

♦ ♦ ♦

సారథి స్టుడియోస్ వారి 'భాగ్యదేవత' తెలుగు, తమిళ చిత్రాల రెండు నిర్మాణం పూర్తయిందని వార్తలు. త్వరలో వెలువడగలవు.

---

# స్వీకారము

**సమాధానవేదిక : ఆచార్యమామిడిపూడి వేంకటరంగయ్య. తెలుగువిద్యార్థి ప్రచురణలు, మచిలీపట్నం. వెల రు. 1-12.**

ఆచార్య వేంకటరంగయ్యగారు 'తెలుగు విద్యార్థి' పత్రికద్వారా అనేకవిషయాలనుగురించి సమాధానములిస్తూవచ్చారు. వారి అపార అనుభవ, పాండిత్య విజ్ఞానములు యీ సమాధానములలోనుట్టిపడు చుండును. వీనినే తెలుగువిద్యార్థి ప్రచురణలవారు గ్రంథరూపంగా ప్రచురించారు. ఇది అమూల్యమైన గ్రంథము. పిన్నలు, పెద్దలుకూడ పఠించి అనేకవిషయాలను గురించి తెలిసికొననగును.

**రేణుక: శ్రీ సరిపల్లి శ్రీమన్నారాయణరెడ్డి. త్రైలోక్య విజయప్రచురణలు, జనార్ధనపురం, గుడివాడతాలూకా, కృష్ణ జిల్లా. వెల రు .-50.**

ఇందలి కథాగమనం కడుసమర్థంగానేకాక పాఠకులకు చదివినంతసేపు ఆసక్తి, ఉత్సాహం, పూరిస్తూ సహజంగాను, సరళంగాను సాగింది. ఇది ఉత్తమ కథారచనగా పరిగణించతగినది. భావముల పొందిక, భావ చక్కగానున్నవి.

**దేవపూజారహస్యము: శ్రీ శివానందనాథ పరమనామధేయ ఈశ్వర సత్యనారాయణ శర్మగారు. ప్రచురణకర్తలు: సాధనగ్రంథమండలి తెనాలి, గుంటూరు జిల్లా, వెల రు.1-75**

ప్రస్తుతము ఆధ్యాత్మిక పారమార్థిక చింతలకు క్రమంగా విముఖులగుచున్న ప్రజలకు భగవత్పూజా మర్మములను వివరించుటయేకాక ఆధ్యాత్మికవాదమును గురించి, భగవంతునిగురించి రేకెత్తియున్న అనేక సందేహములకు రచయిత శాస్త్రీయు, వైజ్ఞానికరీతులలో సముచిత సమాధానములనిచ్చి యున్నారు. ఈ గ్రంథపఠనము ఆత్మ, పరమాత్మల సాక్షాత్కారసాధన కనువైన మార్గములను తెలుపును. అనర్గళంగా నడిచిన యీ రచన మానవకళ్యాణమునకు అనేకవిధాల నుపయోగపడగలదు.

**శ్రీ శారద : శ్రీపురాణపండరామమూర్తి. ప్రచురణకర్తలు : ఆధ్యాత్మ ప్రచారక సంఘము, జగన్నాధపురము, కాకినాడ.**

ఇందులో సరస్వతీపూజావిధానము, అష్టోత్తర శతనామావళి, అథసరస్వతీ సహస్రనామావళి, అంబికావిజయము (కథ) పొందుపరచబడియున్నవి. రానున్నది దేవీనవరాత్రులగుటచే యీ పుస్తకము అనేక కుటుంబీకుల కుపయుక్తమయి దేవి అనుగ్రహకటాక్షములకు పాత్రులుగా చేయగలదని మా విశ్వాసము.

**గోపూజ : శ్రీ పురాణపండ రామమూర్తి, ఆలమూరు, తూ॥ గోదావరి జిల్లా,**

మానవ నిత్యజీవితంలో కామధేనువుగా నొప్పచున్న గోవును ప్రతిహిందువు ఆరాధిస్తుంటాడు. ఇందులో గోపూజావిశేషమును, విధానమును సంపాదకుడు పొందుపరచాడు.

## నేత్రవ్యాధులకు మూలికా ప్రయోగము

పునర్నవ (తెల్లగలిజేరు) మనదేశమునందంతటను దొరకును. చిరకాలమునుండి బాధపడు నేత్రవ్యాధులమీద పనిచేయగలదని నిర్ధారణ కాబడినది. ఈ మూలిక చాలా చౌక అయినప్పటికి 4 శేర్లు ఒక అణా కంటె ఎక్కువ ఖరీదు కాదని ఇచ్చట రిసెర్చి ఆయుర్వేదిక్ కౌన్సిలు వారి రిపోర్టువలన తెలియుచున్నది.

దగ్గరచూపు, దూరపుచూపు కనబడక కండ్లజోడు ఉపయోగించుటకు బదులు యీ మూలికవాడుక వలన దృష్టిలోపము లేకుండా పోయినది.

విమలజ్యోతి అనే మూలికచూర్ణములో తెల్లగలిజేరు రసంపోసి నానబెట్టిన తరువాత ఆ రసం తీసి కంటికి వాడిన కంటి వ్యాధులు పోవును —

ఈ మూలిక విశేషముగ దొరకు ప్రదేశమునకు సమీపమునగల పెద్ద పెద్ద పట్టణములలో రిసెర్చి ఆయుర్వేదిక్ కౌన్సిలువారు నేత్రవ్యాధి నివారణ కేంద్రములు ఏర్పాటు చేయుటకు ఆలోచించుచున్నారు.

# సంపాదకీయములు

## లఘుపరిశ్రమలు - కుటీర పరిశ్రమలు

అభ్యుదయ దశలోనున్న మనదేశంలాంటి దేశాలకు లఘుపరిశ్రమలు, కుటీర పరిశ్రమలు అత్యంత యుపయుక్తములు. లఘుపరిశ్రమలంటే భారీ పరిశ్రమలకు కావలసిన పెద్ద పెట్టుబడులతో అవసరములేకుండా కొద్ది పెట్టుబడులతో భారీపరిశ్రమలు ఉత్పత్తిచేయగల ప్రజావసరాలను ఉత్పత్తిచేసి సమకూర్చగలవి. వీనివల్ల నాణ్యము, ఉత్పత్తుల స్థాయి యించుమించుగా భారీపరిశ్రమల ఉత్పత్తులతో సమానముగా నుండుటయే కాక మానవ శక్తిసామర్థ్యాలకు ఉచిత అవకాశములుండును. పారిశ్రామిక, వర్తక వ్యాపారరంగాలలో సయితము లఘుపరిశ్రమల స్థాపనకు భారీపరిశ్రమలకంటె అవకాశములు మెరుగైనవి.

కుటీరపరిశ్రమలు దైనిక జీవితంలో యంత్రశక్తిమీద నాధారపడకుండనే తమ నిత్యావసరాలను స్వశక్తి సామర్థ్యాలతో ఉత్పత్తిచేసికొనుటకు వినియోగపడునవి. విస్తారముగా జనాభాగల దేశలాంటి మనదేశంలో కుటీరపరిశ్రమలు వర్ధిల్లుటకు, అవి ప్రజల అవసరాలు తీర్చి దేశసౌభాగ్యమును తీర్చి దిద్దుటకు అవకాశములు రము. కుటీర పరిశ్రమలు చేతినిండాపనిని, దానికి తగిన ప్రతిఫలము నియ్యగలవి. మానవుడు తనశక్తి సామర్థ్యాలను, విజ్ఞతను, ఆసక్తిని వినియోగించి ఉత్పత్తులలో ఉత్తమస్థాయిని, నాణ్యమును నిరూపించి, వినియోగదారులమన్ననల పొందుటతోబాటు సంతృప్తితో జీవనము గడుపుట కవకాశము కుటీరపరిశ్రమల మూలమున కలదు.

ఇది యంత్రయుగం కాబట్టి మనం యంత్రశక్తినికాని, భారీ పరిశ్రమలను కాని నిరాకరించలేము. కాని ప్రజలకు పనిపాటుల దృష్ట్యా సాధ్యమైనంతవరకు కుటీరపరిశ్రమలను జాతీయ నిత్యావసరాలకు వినియోగించుకోడం క్షేమకరం. లఘుపరిశ్రమలను కుటీరపరిశ్రమలకు అలవికాని ఉత్పత్తులకొరకు కొద్ది పెట్టుబడులతో నిర్వహించుటకు పూనుకొనవలెను. భారీ పారిశ్రామిక ఉత్పత్తులు విదేశములతో వర్తకవ్యాపారములకు వినియోగించుకొనుటవలన జాతీయ ఆర్థికసౌష్టవము పదిలము కాగలదు.

మద్రాసులో నిర్వహించబడుచున్న అమెరికను లఘుపరిశ్రమల ప్రదర్శనము జాతీయ ఆర్థికస్థితిగతుల ననుసరించి పరిశ్రమలపట్ల వర్తకవ్యాపారములపట్ల ఆసక్తిగలవారికి తమ ప్రయత్నములకు మార్గ దర్శకము కాగలదని మాగట్టి విశ్వాసము.

## శ్రీ హరినాగభూషణంగారి మృతి

వాగ్గేయకారరత్న శ్రీ హరినాగభూషణంగారి నిర్యాణమునకు మేము చాల విచారపడుచున్నాము. వారు సుప్రసిద్ధన్యాయవాది, సంగీత విద్వాంసులు, భగవద్భక్తులు కూడాను. వారు ఫిడేలు, గాత్రకచ్చేరీలు చేసి విశేషకీర్తిప్రతిష్ఠల నార్జించుటతో బాటు రాజులు, రారాజుల ఆదరసత్కారములను పొందినట్టివారు. సంగీత సాహిత్యములలో వారుచేసిన పరిశోధనాత్మక కృషిబహుకొద్దది. మానవాధ్యాత్మిక జీవితముపై సంగీత ప్రభావమును విశదీకరించుటలో కడుసమర్థుడుగా నొప్పినాడు. శ్రీ నాగభూషణంగారు "త్యాగరాజు" మొదలుగాగల హరికథలను సయితము చెప్పుచుండెడివారు. వారి అపారఅనుభవ ప్రజ్ఞావిశేషములు అనేకమంది శిష్యులకు మార్గదర్శకమైనదనుటలో సందియములేదు.

మాపూజ్యబాబు కేసరిగారికి వారితోగల పరిచయము నుద్దేశించి వారి కుటుంబమునకు మాసానుభూతి సంతాపము తెలుపుచున్నాము.

## తెల్లగజ్జెరు - ఆయుర్వేద పరిశోధనాకేంద్రము

నేత్రవ్యాధులకు చాలకాలమునుండి తెల్లగజ్జెరు మనదేశమునందు వాడకమునందున్నది. ఈ మధ్య ఢిల్లీలోని ఆయుర్వేద పరిశోధనకేంద్రమువారి కృషిఫలితముగా అద్దాలవాడకములో నిమిత్తము లేకుండా

పునర్నవ (తెల్లగలేరు) మూలికావినియోగంతో దగ్గర, దూరదృష్టిలోపములను నివారించుకోనగునని కనుగొన్నారు. ఈ పరిశోధనాకృషి అమూల్యమైనదే కాక బహుచౌకయైన యీ మూలిక సర్వప్రజానీకానికి అందుబాటులో నుండునది. ఆయుర్వేద పరిశోధనాకేంద్రమువారి పరిశోధనాకృషి నాధారంగాచేసికొని నేత్రసంబంధమైన సర్వవ్యాధుల నివారణకు పునర్నవను వినియోగించుకోనగును.

ఇంకా మనకు సులభసాధ్యంగా లభించు అనేక మూలికలు — తుంగగెడ్డలు, దురదగొండి విత్తులు, పల్లేరుకాయలు మొదలైనవి ఆయుర్వేద పరిశోధనాకేంద్రంవారి కృషిఫలితంగా బహుళోపయుక్తమయి ప్రజల ఆయురారోగ్యములకు తోడ్పడగలవని ఆశిద్దాం !

## హిందూ దేవాదాయ నిధులవినియోగం

దేవాదాయనిధులను రోడ్లువేయడానికి, ఆనకట్టలు కట్టడానికిలాంటి సంక్షేమ కార్యకలాపాలకు వినియోగించడాన్ని మద్రాసు అసెంబ్లీలో కొందరు సభ్యులు వ్యతిరేకించారు.

భక్తుల నిధులను భగవత్కార్యాలకుద్దేశించి యిచ్చిన మాటవాస్తవమే. అంటే ఉత్సవాలు, ఊరేగింపులు, పూజలు చేయడానికి దుబారాగా ఖర్చుపెట్టేదానికంటె ఆనిధులను ప్రజలలో విద్యావిజ్ఞానములను, సన్మార్గసత్ప్రవర్తనల పెంపుకు, ఆధ్యాత్మిక, పారమార్థికతత్వముల బోధకు వినియోగించడం యీ కాలపు పరిస్థితులకు అనువుగానేయుండును. అనాధలను, నిరాశనిస్పృహలకులోనై పతనము చెందినవారిని ఉద్ధరించుటకు దేవాదాయనిధులు వినియోగపడటము భగవత్సమ్మతమే కాగలదు. భగవంతుడైనా మానవుడు సత్స్వభావముకలిగి, పతనావస్థ నధిగమించి స్వీయసౌభాగ్యముతో బాటు మానవకళ్యాణమును ప్రోత్సహించవలెననియే ఆశించును. దానికి దేవాదాయనిధులు వినియోగపడనగును. రోడ్లు, ఆనకటులు యిత్యాది కార్యక్రమాలకు దేవాదాయనిధులకంటె యితర అవకాశముల వినియోగించనగును.

## అభినందన ఆశీస్సులు

మద్రాసు—"సాయనిలయం" స్వామి కేశవయ్యజీ రెండవ కుమార్తె చి॥ సౌ॥ రాధాబాయికి, మద్రాసు మెడికల్ కాలేజి రిటైర్డు ప్రిన్సిపాల్ డా॥ బి. టి. కృష్ణన్ గారి కుమారుడు చి॥ బి. సత్యనారాయణకు యీ నెల 14 వ తేదిన "ఉడ్‌ల్యాండ్స్‌లో వైభవోపేతంగా వివాహం జరిగింది.

బంధుమిత్రులు, సాయిభక్తులు అనేకులు వివాహమహోత్సవంలో పాల్గొని అభినందనాశీస్సుల నందజేశారు.

భగవంతుడు నూతన దంపతులకు ఆయురారోగ్య సౌభాగ్యములను, ఆదర్శనీయమైన వైవాహిక జీవితమును ప్రసాదించుగాక !

## చిత్ర సమీక్ష

# 'సిపాయికూతురు'

చందమామవారి 'సిపాయికూతురు' చిత్రం యావదాంధ్రదేశంలో విడుదలయునది. ఇందులో జమున, క్రొత్తనటుడు సత్యనారాయణ, గుమ్మడి, సూర్యకాంతం, రాజనాల, నాగయ్య, ఎ. వి. సుబ్బారావు, వంగర, రమణారెడ్డి, పేకేటి, బాలకృష్ణ మొదలగువారు నటించారు. శ్రీ పి. చంగయ్యగారి దర్శకత్వాన నిర్మించబడిన యీ చిత్రానికి కొవ్వలి లక్ష్మీనరసింహరావు మాటలను, పాటలను మల్లాది రామకృష్ణశాస్త్రి, సముద్రాల జూనియర్ వ్రాశారు. ఛాయాగ్రహణ దర్శకుడు ప్రసాద్ గారు.

ఈ జానపదచిత్రంలో జమున సిపాయికూతురుగాను, రాజుగా నాగయ్య, దుష్టుడుగా రాజనాల నటించారు. వంగర, పేకేటి, బాలకృష్ణ, రమణారెడ్డిగారల హాస్యరసపోషణ బాగున్నది. మాటలు, పాటలు బాగున్నవి. నటీనటుల నటనతోబాటు కథాగమనము సరళంగా నున్నది. ఇందులోని ఛాయాగ్రహణం ఉన్నత శిఖరాల నందుకున్నది.

మొత్తంమీద యిందులో ప్రజల నాకర్షించగల హంగులు విశేషంగా వున్నవి. ముఖ్యంగా కొత్త నటుడు సత్యనారాయణను పరిచయం చేయడం ప్రోత్సాహనతగినది.

'శిశి'

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras Ag. Editor : C. C. Punniah.
Proprietors : Kesari Kuteeram (Private) Ltd.

# అపారమైన శక్తియుత్సాహముల మీ ప్రతిష్ఠను కాపాడగలవు

# అమృత

## మధురమైన పానీయము

వ్యాయామ క్రీడల్లో పాల్గొనేవారందరికీ అవసరమైన ఉత్సాహ శక్తుల్నియిచ్చే ముఖ్యసాధనం అమృత - ఆ బాలగోపాలానికి అద్భుతమైన టానిక్. సేవించడానికి తియ్యగావుండి మంచి చురుకుదనాన్ని కల్గిస్తుంది. ఈ అద్భుతమైన పానీయం ప్రసిద్ధమైన మూలికలచేతనూ ఫల రసాలతోను తయారుచేయబడింది. అందరికి ఆత్మబంధువు లాంటిది.




## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్, మద్రాసు-14

---

ఆంధ్రప్రదేశ్ కు, తమిళ నాడుకు ఏజంట్లు :

సీతారామ జనరల్ స్టోర్స్, బెజవాడ, సికింద్రాబాదు, మధుర.

---




# 57 ఏళ్లగా ఖ్యాతి గాంచినది.




లోధ్రలో హానికరమైన వేవీ లేవు. సుఖప్రదమైన జీవితానికి ఆరోగ్యాన్ని చేకూర్చడానికి అది గట్టి మందు. కెమిస్టు లందరి వద్ద దొరుకుతుంది.

లోధ్ర స్త్రీల దివ్యౌషధం.

కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.
రాయపేట - మదరాసు - 14.






ఆంధ్ర ప్రదేశ్, ఒరిస్సాకు ఏజంట్లు :

శీతారాం జనరల్ స్టోర్సు, విజయవాడ & సికిందరాబాద్, బరంపురం